Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*




సంపుటి: 83 • సంచిక: 11 • 15-3-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





### జగన్ మదిలో ఒకటే ఆలోచన...

# కిరణ్ సర్కారును కూలదోసేదెట్లా?

కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రిగా గద్దె ఎక్కిన నాటి నుంచి వదలకుండా వెంటాడుతున్న సమస్య – అవిశ్వాస తీర్మానం. కిరణ్ ఆ కుర్చీ ఎక్కడమే జగన్‌కు ఇష్టం లేదు. ఎక్కిన నాటి నుంచి దించడానికి చేయని ప్రయత్నం లేదు. కాంగ్రెస్ ఎమ్మెల్యేలను పెద్ద సంఖ్యలో తన వైపునకు ఆకర్షించి, ప్రభుత్వాన్ని మైనార్టీలో పడద్రోయాలని చాలా మాట్లు యత్నించాడు. కానీ ఎప్పటికప్పుడు ఏదో ఒక అవాంతరం వచ్చి అది విఫలమైంది. దానివల్ల ఉప ఎన్నికల చీకాకులు తప్ప ప్రభుత్వ మనుగడకు ఇబ్బంది ఎదురు కాలేదు. ఒక దశలో జగన్ పక్షాన దాదాపు ముప్పై నలభై మంది వరకు గోడ దూకడానికి సిద్ధంగా వుండినారు. అయితేవారు గవర్నర్ వద్దకు వెళ్లి ప్రభుత్వం మీద అసమ్మతి తెలుపుతూ లేఖ ఇవ్వడానికి మాత్రం వెనుకడుగు వేశారు. ఆ పని చేస్తే, తాము అసెంబ్లీకి వెళ్లేలోగానే తమ ఎమ్మెల్యే గిరికి మంగళం పాడుతారని భయపడ్డారు. ఎమ్మెల్యేలలో ధైర్యం నింపడం జగన్‌కు చేత కాలేదు. ప్రభుత్వం కూలిపోతే జగన్ పక్కన నిలబడడానికి వారు సిద్ధమే. కానీ తమ పదవులు పోయి ప్రభుత్వం మాత్రం కొనసాగే పరిస్థితిని ఎదుర్కోవడానికి మాత్రం ఇష్టపడలేదు. చూస్తూచూస్తూ కష్టపడి గెల్చుకొన్న పదవిని వదలుకోవడానికి ఎవరికైనా మనసెట్లా వస్తుంది చెప్పండి. దానితో ఆడలేక మద్దెల ఓడన్నట్లు, చంద్రబాబు అవిశ్వాసం పెట్టడం లేదని ఇల్లెక్కి గోల చేయడం అలవాటు చేయడం చేసుకొన్నాడు. కానీ జగన్, ఆయన సోదరి షర్మిల ఎంతగా గొంతు చించుకొన్నా చంద్రబాబు ఇంతకాలం నిమ్మకు నీరెత్తినట్లు వుండిపోయాడు.

కానీ ఇప్పుడు పరిస్థితి మారింది. శాసనసభ సమావేశాలకు ముందే, టిఆర్ఎస్ అధినేత కెసిఆర్ అవిశ్వాస ప్రతిపాదన ముందుకు తెచ్చాడు. ఆ తీర్మానం గట్టెక్కించే బలం కెసిఆర్‌కు లేదు. జగన్‌తో కలుపుకొన్నా చాలదు. ఒక్క చంద్రబాబు సరే అంటేనే తీర్మానం నెగ్గేది. కానీ కెసిఆర్ ప్రతిపాదించిన

కొరవ 14వ పేజీలో

# నేర శిక్షణా కేంద్రాలు!

యావత్ భారతదేశాన్ని కల్లోలపరచిన ఢిల్లీ యువతి సామూహిక మానభంగం కేసులో కీలక నిందితుడు రాంసింగ్ తీహార్ జైలు లోపల ఉరి వేసుకొని చనిపోయాడు. కోర్టులో విచారణ మొదలు కావడానికి కొన్ని గంటల ముందు ఈ దుర్ఘటన జరిగింది. రాంసింగ్ ఎంత విలువైన ఖైదీనో చెప్పనవసరం లేదు. అతడికి కోర్టు నిర్ణయించబోయే శిక్ష ఎట్లా వుంటుందో అని దేశమంతా ఆసక్తిగా ఎదురు చూస్తున్నది. భవిష్యత్తులో మానభంగాలకు పాల్పడ బోయేవారికి ఒక హెచ్చరిక వలె అది వుండాలని అందరూ కోరుకొంటున్నారు. అటువంటి ఖైదీ జైలులో ఆత్మహత్య చేసుకోవడం దారుణమైన ప్రభుత్వ వైఫల్యం. తీహార్ జైలు అంటే కంచుకోట వంటిది. రాత్రీ పగలు పహారా వుంటుంది. సున్నితమైన ఖైదీల విషయంలో మరింత జాగ్రత్త వుంటుంది. రాంసింగ్ తన గదిలో ఒంటరిగా లేడు. మరి ముగ్గురు ఖైదీలు కూడా వున్నారు. ఆ గది పైకప్పు చాలా ఎత్తుగా వుంటుంది. ఏదో ఒక వస్తువు లేకుండా ఆ ఎత్తు అందుకోలేరు. గదిలోనే వున్న ఖైదీలకు మెలుకువ రాకుండా, గది బయట కాపలా వున్న జైలు సిబ్బందికి అలికిడి కాకుండా అంత ఎత్తుకు వెళ్లి, ఉరి పోసుకొని చనిపోవడం అసంభవమైన విషయం. జైలు సిబ్బందే ఏదో ఒక కుట్రతో చంపి ఆత్మహత్యగా చిత్రించి వుండాలి. లేకుంటే ఆ గదిలోని మిగతా ఖైదీలు అతడిని చంపి వుండాలి.

జైలు అంటే నేరస్తులలో పరివర్తన కలగడానికి పునరావాస కేంద్రాలుగా వుండాలని లక్ష్యం. కానీ దురదృష్టవశాత్తు మన జైళ్లు నేరస్తులకు నేర శిక్షణా కేంద్రాలుగా మారిపోతున్నాయి. జైలు లోపల నేరం చేయడం సురక్షితం అనే భావన బలపడిపోతున్నది. నెల్లూరు జైలులో వున్న తీవ్రవాదులను మరొక తీవ్రవాది నిర్భయంగా కలవడం, ఆ తర్వాత హైదరాబాదు దిల్‌సుఖ్ నగర్‌లో బాంబు పేలుళ్లకు వారిద్దరే సూత్రధారులు కావడం ఇందుకొక నిదర్శనం. గుజరాత్‌లోని సబర్మతి జైలులో తీవ్రవాదులు 200 మీటర్ల పొడవున భూగర్భ సొరంగం తవ్వారు. తమకు అనుకూలత లేదని ఆ ఖైదీలు ఆ సొరంగం ద్వారా తప్పించుకోలేదే తప్ప, జైలు అధికారులు దాన్ని గుర్తించలేకపోయారు. మన జైళ్లలో భద్రత ఎంత అధ్వాన్నంగా వుందో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

ఖైదీల నుంచి లంచాలు తీసుకొని వారికి కావల్సిన వసతులన్నీ కల్పించడం జైలు సిబ్బందికి అలవాటుగా మారింది. గంజాయి, సారాయి వంటిమత్తు పదార్థాలు, సెల్ ఫోన్లు వంటివి ఖైదీలకు సులభంగా అందుబాటులోకి వస్తున్నాయి. జైలు లోపలే నేరస్తులు సమావేశాలు జరుపుకొని, జైలు బయట చేయబోయే నేరాలకు ప్రణాళికలు రచించుకోవడం ఆనవాయితీగా మారింది. అనంతపురం జైలులో మద్దెల చెరువు సూరి, మొద్దు శీను వంటివారు చేసింది అదే పని. అదే జైలులో మొద్దు శీను మరణం – జైలు లోపల జరిగే నేరాలకు ఒక నిదర్శనం.

జమీన్‌రైతు

దేశంలో ఒక ప్రక్క తీవ్రవాదం పెచ్చరిల్లుతున్న సమయంలో మన జైళ్లు ఇంత దారుణంగా తయారు కావడం దేశ భద్రతకు ప్రమాదం. నేరస్తుడిని జైలులో పెట్టడం అంటే అతడి నేరాలకు అడ్డు కట్ట వేయడంగా భావించాలి. కానీ జైలుకు వెళ్లడం తదుపరి నేరాలకు రిహార్సల్ అన్నట్లు మారిపోతున్నా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. జైళ్లను సంస్కరించడానికి, తప్పులను సరిదిద్దడానికి ఏ మాత్రం ప్రయత్నం చేయడం లేదు.

రాంసింగ్ ఉదంతంతో అయినా ప్రభుత్వాలలో కదలిక రావడం అవసరం. జైలు సిబ్బందిలోని అవినీతి వల్ల ఖైదీలు మరిన్ని నేరాలు ఘోరాలు చేయడానికి అవకాశం ఏర్పడకుండా కట్టుదిట్టమైన చర్యలు చేపట్టాలి. ఖైదీలకు సహకారం అందించే జైలు సిబ్బందిని, అధికారులను కూడా నేరస్తులుగా పరిగణించి, కఠినమైన చర్యలు తీసుకొంటే తప్ప ఈ పరిస్థితి మారదు.

## జనవాణి

### ఇదేం బడ్జెట్?

కేంద్ర ఆర్థికమంత్రి చిదంబరం ప్రవేశపెట్టిన బడ్జెట్‌కు జనాకర్షణ బడ్జెట్ అని స్వపక్షం అంటే, ప్రజా వ్యతిరేక బడ్జెట్ అని ప్రతిపక్షం అంటుంది. పాలక పక్షాలు వారి పార్టీ మనుగడకు సహకరించే వర్గాల ప్రయోజనాలను కాపాడడానికే ఈ బడ్జెట్‌లో గమ్మత్తులు జరుగుతుంటాయి. నెహ్రూ కాలం నుంచి నేటి దాకా, ప్రతిపక్షంలో ఎవరున్నా బడ్జెట్‌ను సమర్థించిన దాఖలాలు లేవు. ఈసారి బడ్జెట్‌లో ఏదైనా కొత్త దనం ఉందంటే అదే సూపర్ రిచ్ అనే పదం చేరడం. ఈ వర్గానికి 10శాతం సర్‌ఛార్జీ విధిస్తానన్నారు చిదంబరం. వీరి సంఖ్య దేశంలో 42,800లేనని, వీరికి కోటి రూపాయలకుపైగా వార్షికాదాయం ఉందన్నారు. ఈ ఒక్క ప్రకటన చాలు మన దేశ బడ్జెట్ ఎంత కాకి లెక్కల బడ్జెట్టో చెప్పడానికి. ఒక్క మన జిల్లాలోనే ఇంతమంది కోటీశ్వరులున్నారు. దేశంలో ఎన్ని జిల్లాలున్నాయి? ఎన్ని కోట్ల మంది కోటీశ్వరులున్నారు. వీరిపై పన్నులు వేయాల్సింది పోయి పెట్రోల్, డీజిల్, నిత్యావసర వస్తువులు, గ్యాస్ సిలిండర్లు, బియ్యం రేట్లు పెంచి సామాన్య, మధ్యతరగతీయుల నడ్డి విరుస్తుంటాడు కోటీశ్వరుడైన మన ఆర్థికమంత్రి చిదంబరం. నోరులేని వాళ్లపైనే అందరు ప్రతాపం చూపిస్తారు.

పి.వి.సుబ్బారావు — నెల్లూరు

### రైల్వేమంత్రికి విజ్ఞప్తి!

మొన్నటి రైల్వే బడ్జెట్‌లో నెల్లూరు ప్రజలకు జరిగిన మేలు ఏమిటో అర్థం కావడం లేదు. అయినా కేంద్ర రైల్వేశాఖ సహాయమంత్రిగా కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి పని చేస్తున్నారు. కాబట్టి ఆయన కాస్త శ్రద్ధ వహించి శ్రీకాళహస్తి – నడికుడి రైలు మార్గాన్ని మూడునాలుగేళ్లలో పూర్తయ్యేలా చర్యలు తీసుకోమనవి. విజయవాడ లేదా గుంటూరు నుండి బెంగుళూరుకు పగలు నడిచేలా ఒక రైలు వేస్తే రాష్ట్రానికి మేలు చేసిన వారవుతారు. నెల్లూరులో తమిళనాడు తోపాటు ఇతర సూపర్ ఫాస్ట్ రైళ్లు నిలిపేలా చర్యలు తీసుకోవాలి. గూడూరు నుంచి ముంబాయికి ఒక రైలును గుంటూరు, హైదరాబాద్ మీదుగా నడిచేట్లు చూడాలి. ఈ రూటులో ముంబాయికి రైలు లేదు. వీటిని రైల్వే మంత్రి గమనించి పరిష్కరించమనవి.

ఆర్.వెంకటేశ్వర్లు — నెల్లూరు

### మన పోలీసులు మారాలి!

మన సినిమాల్లో హీరో విలన్లను చివరి సీన్‌లో చితగ్గొట్టిన తర్వాత యూఆర్ అండర్ అరెస్ట్ అంటూ పోలీసులు రంగ ప్రవేశం చేస్తారు. సినిమాల్లోనే కాదు నిజంగా సైతం ఇలానే ఉంటాం అని చెబుతున్నారు కొన్ని సందర్భాల్లో పోలీసులు. హైదరాబాద్‌కు ఉగ్రవాద పేలుళ్ల హెచ్చరికలు వున్నా పోలీసులు తేలిగ్గా తీసుకోవడం వల్లే 16మంది చనిపోయారని సర్వత్రా విమర్శలు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-3-1943
పేజీలు : 4 వెల: 0-1-0

### నెల్లూరు ముచ్చట్లు

#### రైతుసభ

కాకి చేత కబురంపగానే రెండు, మూడు వందల బడాబడా రెడ్లు 17తేది నెల్లూరులో జరిగిన సభకు వచ్చారు. సన్నపురెడ్డి (సన్నపురెడ్డి కాబోలు?) సుబ్బరామిరెడ్డి అధ్యక్షతన సభ జరిగింది. రామచంద్రారెడ్డి గారు, పొన్నలూరు లక్ష్మీ నర్సారెడ్డి – రాఘవరెడ్డిగార్లు, దేవిరెడ్డి రమణారెడ్డి, అనవల్లిరెడ్డి, జమీన్‌రైతు నాయుడు, జోషిముతారావు వగైరాలు మాట్లాడారు.

వడ్లకు కంట్రోలు పెట్టరాదనీ, అట్లా పెట్టేట్టుంటే అన్ని ఆహార పదార్థాలు వ్యవసాయక సామానులకు గూడా కంట్రోలు పెట్టమనీ తీర్మానాలు చేశారు. బెజవాడ రామచంద్రారెడ్డి గారి ఆధ్వర్యాన సివిల్ సప్లయి శాఖాధికారి వద్దకు రాయబారం వెడలాలనీ తీర్మానించారు. రాయబారం ఈదినం (19తేది) జరిపారు నెల్లాళ్లో – ఫలితాలు దేముడెరుగు? వివరాలు విమర్శలు – తర్వాత.

#### స్ఫోటక విజృంభణ

కలరా గారు వెళ్తూ స్ఫోటకం గారిని ప్రవేశపెట్టి పోయినారు. నెల్లూరు టవున్‌లో 58మందికి సోకింది. 11మంది మరణించారు. హిట్లరుగాడి కంటే భీషణంగా వుంది స్ఫోటకం గారి హడావిడి.

#### అరెస్టులు – శిక్షలు

ఇందుపూరు ప్రెసిడెంటు కొనగళ్ల శేషాచలం శెట్టి గారు నిషిద్ధ కరపత్రాలు పంచాడని డిఫెన్సుఆక్టు క్రింద 12 తేది ఆత్మకూరు మకాములో 1 సంవత్సరము కఠినశిక్ష విధించారు. 15వతేది బళ్లారి జైలుకు తీసుకపోయిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-3-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు

#### కావలి సబ్ కోర్టు

ఏ సంవత్సరానికా సంవత్సరం పొడిగింపబడుతూ దిన గండంగా ఉండిన సబ్‌కోర్టును కావలిలో ఖాయం చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వు జేసింది. పెన్నాకు ఉత్తరంగా వున్న ఏడు తాలుకాలు ఈకోర్టు క్రింద వున్నవి. మున్సిఫ్ కోర్టు ఆవరణంలోనే దీనికి శాశ్వత భవనం నిర్మాణమైతే అందరికీ సౌకర్యంగా ఉండగలదని న్యాయవాదుల అభిప్రాయం.

#### పొట్టేపాళెం రైతులపై లేబరు వర్గం దౌర్జన్యం!

1962 జూలై 21తేది నెల్లూరు తాలుకా పొట్టేపాళెంలో రైతులు – లేబరు మధ్య జరిగిన సంఘర్షణలకు సంబంధించి యిరువర్గాల మధ్య జామీను కేసులు పెట్టబడి, నెల్లూరు రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు రాపూరు మకాంలో 9వ తేది వాయిదాకు హాజరై, రైతులు ఆనాటి సాయంకాలం 4.30 గంటలకు బస్సుఎక్కి నెల్లూరుకు వస్తుండగా; ఈ కేసులలో ఉన్న లేబరు వర్గం వారు షుమారు 70 మంది గోవుల పిచ్చిరెడ్డి నాయకత్వాన రాపూరు హరిజనవాడ వద్ద కాచుకొని వుండి, రెండెద్దుల బండిని రోడ్డు కడ్డంగా త్రోసి, బస్సును అడ్డగించి, బస్సులోని రైతులను క్రిందకు లాగి, ఆ బండి గుబ్బలతోనే చావ మోదారని, అందులో పొట్టేపాళెం పంచాయితీ అధ్యక్షుడు కొండ్లపూడి మల్లారెడ్డి, చెన్నారెడ్డి సుబ్బారెడ్డి, గుండాల శేషురెడ్డి, వల్లంరెడ్డి, రామచంద్రారెడ్డి, చెన్నారెడ్డి కృష్ణారెడ్డి, చలంచర్ల పోలయ్య, రామిరెడ్డి నరసారెడ్డి, కొడవలూరు కోటయ్య అను 8మంది తీవ్రంగా గాయపడినారని; ఆ బస్సులోనే ప్రయాణం చేస్తుండిన పోలీస్ బృందం ఒకటి జోక్యం కల్పించుకొని, గుంపును చెదరగొట్టారని తెలుస్తున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## పరమ శివునికి పోలీసు రక్షణ

మహా శివరాత్రి పర్వదినాన్ని పురస్కరించుకొని నగరంలోని చిన్నా పెద్దా శివాలయాల వద్ద భక్తవ శంకరుని రక్షణకు పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయడం భక్తులను విస్తుపోయేలా చేసింది. గతంలో ఎప్పుడూలేనట్లుగా మూలపేటలోని మూలస్థానేశ్వరాలయంలో లోపలా, వెలుపల పెద్ద సంఖ్యలో పోలీసులు పహారా కాశారు. చేపల మార్కెట్ వద్ద గల ఉమామహేశ్వరాలయం వద్ద కూడా పోలీస్ పికెట్ ఏర్పాటు చేశారు. మూలపేటలో మూలస్థానేశ్వర స్వామి పగటిపూట ఊరేగింపుకు సైతం పోలీసులు రక్షణగా వచ్చారు. శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదంటారు. అటువంటి స్వామికి రక్షకభటుల రక్షణ అవసరమా అన్న సందేహం భక్తుల మదిలో మెదిలింది.

## ఘనంగా శివరాత్రి

మహాశివరాత్రి పండుగను నెల్లూరీయులు ఘనంగా చేసుకొన్నారు. 10వ తేదీ వేకువజాము నుంచే మూలపేటలోని మూలస్థానేశ్వర స్వామి ఆలయం భక్తులతో కిటకిటలాడింది. అర్థరాత్రి నుంచి లింగోద్భవ సమయం వరకు ఈ దేవస్థానంలో భక్తుల రద్దీ కొనసాగింది. చేపల మార్కెట్ వద్ద ఉమామహేశ్వరాలయంలోని పరమ శివునికి నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి దర్శించి అర్చించారు. దర్గామిట్టలోని రాజరాజేశ్వరమ్మ దేవస్థానంలోని సుందరేశ్వరుని సైతం పెద్ద సంఖ్యలో భక్తులు సందర్శించారు.

## రోటరీ క్లబ్ నిర్వాహకులపై విమర్శ!

నెల్లూరు ఆర్టీసి బస్టాండ్ దగ్గర ప్రస్తుత విలువ ప్రకారం అయితే 36 కోట్ల రూపాయల విలువైన స్థలాన్ని దాత రొటేరియన్ ఏనుగ పట్టాభిరామిరెడ్డి రోటరీ క్లబ్‌కు దానంగా ఇచ్చారు. ఈ స్థలంలో రోటరీ క్లబ్ ఏనుగ పట్టాభిరామిరెడ్డి పేరిట కళ్యాణ మండపం, కంటి ఆసుపత్రి నిర్వహిస్తుంది. ప్రస్తుతం రోటరీ క్లబ్ నిర్వాహకులుగా ఆర్యవైశ్యులు కొనసాగుతున్నారు. పట్టాభిరామిరెడ్డి బతికున్న రోజుల్లోనే ఈ స్థలం ప్రక్కన స్థలాన్ని నెల్లూరు రమణారెడ్డి, గరటారెడ్డిలకు విక్రయించారు. గరటారెడ్డి ఈ స్థలాన్ని నగరంలోని ఓ వైశ్య ప్రముఖునికి అమ్మగా ఆయన ఇక్కడ ఓ కళ్యాణ మండపం కట్టారు. రోటరీ కళ్యాణ మండపం, నెల్లూరు రమణారెడ్డి స్థలానికి సంబంధించిన ఉమ్మడి రహదారి, పార్కింగ్, లైటింగ్‌లతోపాటు పెద్ద ఆర్చ్‌ను కళ్యాణ మండపం వాళ్లు నిర్మించి వాడుకొంటున్నారు. స్వకులస్తుడు కళ్యాణ మండపం బాగా నడవాలని ఈ విషయమై రోటరీ క్లబ్ నిర్వాహకులు ఉమ్మడి ఆస్తిని స్వంత ఆస్తిగా వినియోగించుకొంటున్న వ్యక్తిని అడగడం లేదని ప్రధాన ఆరోపణ. దీనికి రోటరీ పెద్దలు చెప్పే సమాధానం ఏమిటో?

## బాలు నోట జమీన్‌రైతు

జమీన్‌రైతు పత్రిక నిష్పాక్షికతను, నిజాయితీని గురించి ప్రముఖ గాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ప్రస్తావించారు. ఈటీవీలో ప్రసారమౌతున్న 'పాడుతాతీయగా' కార్యక్రమాన్ని ఇటీవల నెల్లూరులో నిర్వహించిన సంగతి తెలిసిందే. ఈ ధారావాహిక 11వ తేది ప్రసారమైన సందర్భంలో బాలు 'జమీన్‌రైతు' పత్రిక, దాని గొప్పతనాన్ని మరోమారు ప్రశంసించారు. నిరాటంకంగా 80 ఏళ్లకు పైగా వెలువడుతూ నెల్లూరు యాసను సజీవం చేస్తున్నది 'జమీన్‌రైతు' అన్నారు. నెల్లూరీయులు దేశవిదేశాలలో ఎక్కడ వున్నా ఈ పత్రిక తప్పకుండా చదివి తీరుతారన్నారాయన.

## నారాయణ మెడికల్ కాలేజి వద్ద రచ్చ!

నెల్లూరు నారాయణ మెడికల్ కాలేజిలో ఎమ్మెస్సీ నర్సింగ్ చదువుతున్న విద్యార్థిని నిరూష విషపు ఇంజక్షన్ వేసుకొని 11వ తేది కాలేజి హాస్టల్‌లో చనిపోయి ఉండడంతో రచ్చ రేగింది. నిరూషది చిత్తూరు జిల్లా చంద్రగిరి మండలంలోని రంగంపేట. మెడికల్ కాలేజిలో ఫస్ట్ ఇయర్ చదువుతున్న ఈమె వివాహిత. 6వ తేది రంగంపేట వెళ్లి 9వ తేది కాలేజికి వచ్చిన నిరూష 11వ తేది పరీక్ష ఉన్నా దానికి హాజరుకాక హాస్టల్‌లోనే ఉండింది. సాయంత్రం విధి నిర్వహణలో భాగంగా రౌండ్స్‌లో ఉన్న వార్డన్ ఆమె అపస్మారక స్థితిలో ఉండగా గమనించి హాస్పిటల్‌కు తరలించగా మరణించినట్లు పరీక్షించిన డాక్టర్లు చెప్పారు. ఈ వ్యవహారం బయటకు ప్రాక్కగానే వివిధ విద్యార్థి సంఘాల నాయకులు మెడికల్ కాలేజి వద్ద గొడవకు దిగగా పోలీసులు, ఆసుపత్రి నిర్వాహకులు వారిని నిలువరించారు. నిరూష భర్త, అత్తమామల వేధింపులు తాళలేక ఈ ఘాతుకానికి పాల్పడినట్లు పోలీసు విచారణలో తేలింది.

## ఆదివారం పండుగ హాయి!

ఆదివారం పూట హిందూ సోదరులు నాన్‌వెజ్ ముట్టని పండుగ చేసుకొంటే ఆ రోజు మాంసాహారం రేటు బాగా పడిపోతుందని శివరాత్రి నిరూపించింది. ఈ పండుగ రోజు చాలా మంది నాన్‌వెజ్ ముట్టకపోవడంతో పెద్దబజారులోని చేపలు, మాంసం మార్కెట్లు జనం లేక వెలవెలబోయాయి. జలపుష్పాలు (చేపల) రేట్లు బాగా తగ్గిపోయాయి. రొయ్యలు, పీతల రేట్లు నేలనంటాయి. శివరాత్రి విషయాన్ని మరచి కసాయిలు పొట్టేళ్లు, కోళ్లుకోసి వాటి మాంసం అమ్ముడుపోక మరుసటి రోజు అమ్మను శీతల పెట్టెలలో భద్రపరచాల్సి వచ్చింది. మొత్తానికి మహాశివరాత్రి మాంసాహారులకు తక్కువ రేట్లకు మాంసాహారం దొరికేట్లు చేసింది.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## బాలాజీనగర్‌లో చోరీ!

నెల్లూరు బాలాజీనగర్‌లో 11వ తేది పెద్ద చోరీ జరిగింది. ఇక్కడి గీతాంజలి స్కూల్ ప్రక్కవీధిలో నివశిస్తున్న కసిరెడ్డి విజేంద్రరెడ్డి టైర్ల వ్యాపారం చేస్తారు. శివరాత్రిని పురస్కరించుకొని వీరి కుటుంబం పెంచలకోనలోని లక్ష్మీనరసింహ స్వామి దర్శనానికి వెళ్లింది. 11వ తేది ఉదయం వచ్చి చూడగా వేసిన తాళం వేసినట్లే ఉంది. ఇంట్లోని వస్తువులు చిందరవందరగా పడి వున్నాయి. పడక గదిలోని బీరువా పగులగొట్టి దానిలోని 28 సవర్ల బంగారు, ఒకటిన్నర కిలోల వెండి వస్తువులు, 40వేల రూపాయలు మాత్రం లేవు. వంట గదిలోని గ్రిల్ తొలగించి ఈ దొంగతనానికి పాల్పడ్డారు. ఇంటి యజమాని ఫిర్యాదు మేరకు బాలాజీ నగర్ సిఐ, నగర డిఎస్పీ వెంకటనాధ్ రెడ్డి, సిఐ వీరాంజనేయరెడ్డి సంఘటనా స్థలాన్ని పరిశీలించారు. ఏదిఏమైనా బాలాజీనగర్‌లో దొంగతనాలు ఆగడం లేదు. పోలీసులకు దొంగలు తరచూ సవాళ్లు విసురుతూనే వున్నారు. దీనికి బాలాజీనగర్ సిఐ ఏమంటారో?



**అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా నెల్లూరులోని వసంతలక్ష్మి చారిటబుల్ ట్రస్ట్ నిర్వాహకురాలు టి.వసంతలక్ష్మికి దూరదర్శన్‌లోని సప్తగిరి ఛానల్ ప్రకటించిన సేవామణి అవార్డును అందజేస్తున్న గవర్నర్ సతీమణి విమలా నరసింహన్, డిడి డిప్యూటీ డైరెక్టర్ శైలజా సుమన్.**

## వస్త్ర వ్యాపారుల బంద్!

వస్త్రాల అమ్మకంపై ఒక శాతం వ్యాట్ విధింపు నిరసనగా గత వారం రోజుల నుంచి వస్త్ర వ్యాపారులు చేస్తున్న సమ్మె విజయవంతంగా కొనసాగుతోంది. వస్త్ర వ్యాపారులు గట్టిగా వ్యాట్‌ను నిరసిస్తున్నా రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయమై వ్యాపారస్తులకన్నా రెండింతలు గట్టి పట్టుదలతో వ్యవహరించడం విమర్శకు తావిస్తుంది.

## చాట్ల కుమారునికి తీవ్ర గాయాలు!

నెల్లూరు నగరంలో మెజార్టీ శాతం యువకులు కళ్లాలులేని గుర్రాల్లా తమ స్కూటర్లు నడుపుతున్నారు. విపరీతమైన వేగంతో వెళ్తుండిన స్కూటరిస్టు మూలపేటలోని తన ఇంటి నుంచి స్కూల్‌కు నడుచుకొంటూ వస్తుండిన నగర కాంగ్రెస్ అధ్యక్షుడు చాట్ల నరసింహారావు కుమారుడు రాజేష్‌ను 11వ తేది రాత్రి ఢీకొనడంతో ఆయన తీవ్రంగా గాయపడ్డారు. మెదడులో రక్తం గడ్డకట్టడంతో మెరుగైన చికిత్స కోసం ఆయన్ను నెల్లూరు నారాయణ హాస్పిటల్ నుంచి చెన్నై గ్లోబల్ ఆసుపత్రికి తరలించారు.

పోలీసు జీపు రావడంతో గత్తరపడ్డ స్కూటరిస్టు ఈ ప్రమాదం చేసినట్లు స్థానికుల కథనం.

## సిపిఎం పాదయాత్రలు

విద్యుత్ సర్‌ఛార్జీలకు వ్యతిరేకంగా నగరంలోని అన్ని డివిజన్లలో సిపిఎం పాదయాత్రలు నిర్వహిస్తుంది. అయితే జనం మాత్రం ఈ పాదయాత్రలను పెద్దగా పట్టించుకోవడం లేదు.

## బ్యాంకులో అలారం మ్రోగించిన మూషికం!

10వ తేది నెల్లూరు రామ్మూర్తి నగర్‌లోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌ను ఆదివారం సెలవు దినం కావడంతో మూసి వుంచారు. కానీ మధ్యాహ్నం 11 గంటల సమయంలో బ్యాంక్‌లోని అలారం మోగడంతో స్థానికులు పోలీసులకు తెలపడం, బాలాజీనగర్ సిఐ మంగారావు తన సిబ్బందితో సహా వచ్చి బ్యాంక్ చుట్టూ ఆయుధాలతో మోహరించారు. మేనేజర్‌ను పిలిపించి తాళం తీయించి విషయం పరిశీలించాక ఓ చిలిపి మూషికం ఈ చర్యకు పాల్పడినట్లు తెలుసుకొని నిట్టూర్పు విడిచారు.

కొరవ 14వ పేజీలో



పుష్పయాగం సందర్భంగా రాజేశ్వరమ్మ వైభవం.

## రాజరాజేశ్వరమ్మకు పుష్పయాగం!

● విగ్రహ ప్రతిష్ట జరిగి 37 ఏళ్లు పూర్తయ్యాయి.

నెల్లూరీయుల ఆరాధ్యదేవత రాజరాజేశ్వరమ్మకు పుష్పయాగం ఇటీవల ఘనంగా నిర్వహించారు. అమ్మవారి విగ్రహ ప్రతిష్ట జరిగి 37 ఏళ్లు పూర్తయిన సందర్భంగా ఈ కార్యక్రమం జరిగింది. మొదట ఈ సీజన్‌లో దొరికే పుష్పాలతో అమ్మవారికి అభిషేకం జరిగింది. ఈ సందర్భంగా గర్భాలయం, అలివెట్టి మండపం, రాజగోపురం ప్రాంగణాన్ని అలంకరించారు. పుష్పయాగం సందర్భంగా దేవస్థానాన్ని అద్భుతంగా పుష్పాలతో అలంకరించిన వైనాన్ని చూడను వేలసంఖ్యలో భక్తులు దేవాలయానికి విచ్చేశారు. సన్నపురెడ్డి పెంచలరెడ్డి, పద్మావతమ్మ ఈ పుష్పయాగానికి ఉభయదాతలుగా వ్యవహరించారు. ఈ యాగాన్ని ప్రధాన అర్చకులు తంగిరాల రాధాకృష్ణశర్మ, సుబ్బారావు నిర్వహించారు. ఈ సందర్భంగా గోపూజ, మహా సంకల్పం, గణపతి పూజ, సహస్రనామపూజ, గోత్రనామపూజలు నిర్వహించారు. జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం సతీసమేతంగా ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి సతీమణి హిమవతమ్మ, దేవస్థానం ఛైర్మన్ రత్నం జయరామ్, ఆల్తూరు ఆదినారాయణరెడ్డి తదితరులు పాల్గొన్నారు. పుష్పయాగం సందర్భంగా రాజరాజేశ్వరమ్మ వైభవం చూడను భక్తులకు రెండు కళ్లు చాలలేదనాలి.

## సేతురామిరెడ్డి చిరస్మరణీయుడు!




సంతాపసభలో మాట్లాడుతున్న మంత్రి రామనారాయణరెడ్డి.

నైతిక విలువలకు ప్రతీకగా నిలిచిన గండవరపు సేతురామిరెడ్డి చిరస్మరణీయుడని బిజెపి జాతీయ నాయకుడు, రాజ్యసభ సభ్యుడు ఎం.వెంకయ్యనాయుడు చెప్పారు. సిపిఐ పార్టీ ఆధ్వర్యంలో టౌన్‌హాల్‌లో జరిగిన సేతురామిరెడ్డి సంతాప సభలో పాల్గొని మాట్లాడారు. నేటి రాజకీయాల్లో విలువలు పడిపోయాయి. సేతురామిరెడ్డి కడవరకు విలువలతోనే బ్రతికారన్నారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ ప్రజాసేవకు అసలుసిసలైన నమూనా గండవరపు సేతురామిరెడ్డి అన్నారు. సైకిల్ మీద తిరుగుతూ ప్రజాసేవకు అంకితమైన వ్యక్తిగా ఆయన రాష్ట్రవ్యాప్తంగా పేరు గడించినట్లు చెప్పారు. బంగ్లాతోట ప్రాంతంలో కార్పొరేషన్ నిర్మిస్తున్న నూతన హైస్కూల్ భవనానికి గండవరపు సేతురామిరెడ్డి పేరు పెడుతున్నట్లు ప్రజల హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. తెలుగుదేశంపార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, ఎమ్మెల్సీలు వాకాటి నారాయణరెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం, కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, నెల్లూరు సిటి ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, సేతురామిరెడ్డి మేనల్లుడు వరప్రసాద్‌రెడ్డి, సివి శేషారెడ్డి, జక్కా వెంకయ్య తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

● మహా నగరాలకు ధీటుగా

## నెల్లూరును తీర్చిదిద్దుతా!

నెల్లూరు నగరాన్ని పెద్ద నగరాలకు ధీటుగా తీర్చి దిద్దుతున్నామని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. నగరంలో కొత్తగా ఏర్పాటు చేసిన సెంట్రల్ లైటింగ్‌ను చిల్డ్రన్‌పార్కు దగ్గర మంత్రి ప్రారంభించి మాట్లాడారు. నేను రాష్ట్రమంత్రినే అయినా నిధుల మంజూరులో నెల్లూరుకు ప్రాధాన్యం ఇస్తానన్నారు. నగరంలో త్రాగునీరు, డ్రైనేజీ, రోడ్ల విస్తరణతోపాటు సెంట్రల్ లైటింగ్‌ను అన్ని ముఖ్య రహదారులలో ఏర్పాటు చేశామన్నారు. స్టోన్‌హౌస్‌పేట, రైల్వే ఫీడర్స్‌రోడ్డు, చిల్డ్రన్



సెంట్రల్ లైటింగ్ శిలాఫలకాన్ని ఆవిష్కరిస్తున్న మంత్రి రామనారాయణరెడ్డి.

పార్కు రోడ్డు, భక్తవత్సలనగర్, అయ్యప్పగుడి, మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం, మద్రాసు బస్టాండ్ సెంటర్లలో సెంట్రల్ లైటింగ్ వ్యవస్థ ఏర్పాటు చేయను 2కోట్లు 35లక్షల రూపాయలు ఖర్చుపెట్టినట్లు చెప్పారు. హైదరాబాద్ తర్వాత నెల్లూరులోనే ఆరులైన్ల రోడ్ల విస్తరణ జరుగుతుందన్నారు. 400 కోట్లతో మరో సమ్మర్ స్టోరేజి ట్యాంకు, 800 కోట్ల రూపాయలతో భూగర్భ డ్రైనేజి పనులు త్వరలో చేపడుతున్నామన్నారు. ఆనం కుటుంబాన్ని దశాబ్దాల కాలంగా ఆదరిస్తూ నలుగుర్ని శాసనసభ్యులను, ముగ్గుర్ని మంత్రులను చేసిన జిల్లా ప్రజలకు ఏంచేసినా రుణం తీర్చుకోలేమన్నారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఆనం విజయకుమార్ రెడ్డి, రంగమయూర్‌రెడ్డి, మునిసిపల్ కమిషనర్ డాక్టర్ ఆంజనేయులు పాల్గొన్నారు.

## చిన్నారులను వెన్నాడుతున్న దృష్టిలోపం!

● విఫలమైన ప్రభుత్వ పథకాలు

జిల్లాలో అధికశాతం మంది విద్యార్థులను దృష్టిలోపం సమస్య వెన్నాడుతోంది. చిన్న వయసులోనే చిన్నారులు సక్రమంగా చూడలేని బాధాకరమైన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇటీవల అధికారులు జరిపిన పరిశీలనలో చిన్నారులకు ఏర్పడుతున్న దృష్టిలోపం సమస్య తెలియవచ్చింది. జవహర్ బాల ఆరోగ్యరక్ష, రాజీవ్ విద్యామిషన్ సంయుక్తంగా పిల్లలకు నిర్వహించిన నేత్ర పరీక్షల్లో ఈ విషయం వెల్లడైంది. జిల్లాలోని ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థుల్లో 17,600 మంది పిల్లలు కంటి చూపు సమస్యను ఎదుర్కొంటున్నట్లు మొదటి విడత పరీక్షల్లో తెలియవచ్చింది. మిగతా పిల్లలందరిని, ప్రైవేట్ పాఠశాలల్లో చదివే వారికి చూపు పరీక్షలు నిర్వహిస్తే ఈ సంఖ్య మరింత పెరిగే అవకాశాలున్నాయి. వీరందరిలో విటమిన్ 'ఎ' తక్కువగా వుండడం వల్లే అంధత్వ సమస్యలను ఎదుర్కొంటున్నట్లు వైద్యులు చెప్తున్నారు. దీనికితోడు గంటల తరబడి టివీలు చూడడం, కంప్యూటర్ ముందు గడుపుతుండడం కారణంగా భావిస్తున్నారు. చిన్నారుల ఎదుగుదలకు, కంటి చూపు విషయంలో కీలకమైన విటమిట్ 'ఎ' ను పంపిణీ చేయాల్సిన బాధ్యత ప్రభుత్వంపై వుంది. ఐదేళ్లలోపు చిన్నారులకు ప్రతి ఆరు నెలలకు ఒకసారి విటమిన్ 'ఎ' డోసు సక్రమంగా అందించాలి. కానీ సంబంధితశాఖ అధికారులు ఈ విషయంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఫలితంగా పిల్లలు చిరుప్రాయంలోనే కంటిచూపు కోల్పోయే ప్రమాదం ఏర్పడిందని పలువురు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. రాజీవ్ విద్యామిషన్, జవహర్ బాల ఆరోగ్య రక్ష, వైద్యఆరోగ్యశాఖ అధికారులు స్పందించి పిల్లల కంటిచూపు విషయమై పట్టించుకోవాల్సి వుంది.



ప్రజల సమస్యలు అడిగితెలుసుకొంటున్న డాక్టర్ అనిల్‌కుమార్‌యాదవ్.

## సిఎం అసమర్థతవల్లే... విద్యుత్ కష్టాలు!

● ప్రజాదీవెనలో వైకాపా నేత అనిల్ ధ్వజం

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి అసమర్థత వల్లే ప్రజలకు విద్యుత్ కష్టాలు తప్పడం లేదనీ వైకాపా నెల్లూరు నగర నియోజకవర్గ ఇన్‌ఛార్జ్ డాక్టర్ పి. అనిల్‌కుమార్ యాదవ్ విమర్శించారు. నగరంలోని మూడవ డివిజన్‌లో ఇటీవల ఇంటింటా ప్రజాదీవెన కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కరెంట్ కోతలతో అన్ని వర్గాల ప్రజలు అవస్థలు పడుతున్నారు. దివంగత సిఎం వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పాలనలో ఒక్క ఏడాది కూడా విద్యుత్ కోతలు విధించలేదన్నారు. ఆయన మరణానంతరం కాంగ్రెస్ పాలనలో పరిస్థితి తారుమారైందన్నారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి పాలనపై అవగాహన లేకపోవడం సమస్యలపై ముందు జాగ్రత్తలు తీసుకోకపోవడంతోనే రాష్ట్రం అంధకారంగా మారిందని ధ్వజమెత్తారు. ఇప్పటికీ చిన్న పరిశ్రమలు మూతపడుతుండగా పెద్ద పరిశ్రమలు ఇతర రాష్ట్రాలకు తరలిపోతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. దీంతో ఉపాధి లేక కార్మికులు ఇతర రాష్ట్రాలకు వలసలు పోవాల్సిన దుస్థితి ఏర్పడిందన్నారు. మూడో డివిజన్ బిజెపి ఇన్‌ఛార్జ్ నల్లం రమణయ్య ఆధ్వర్యంలో పలువురు బిజెపి కార్యకర్తలు, యువకులు వైకాపా తీర్థం పుచ్చుకొన్నారు. ఈ కార్యక్రమంలో మాజీ కార్పొరేటర్ సంక్రాంతి కళ్యాణ్, పోలంరెడ్డి వెంకటేశ్వర్లు, దండే లక్ష్మీరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## రూటుమార్చిన స్మగ్లర్లు!

● బస్సుల్లో అక్రమ రవాణా

అక్రమ సరుకుల రవాణాకు బస్సులను ఎంచుకొన్నారు స్మగ్లర్లు. అధికారులను ఏమార్చి కొత్తదారులు తొక్కే స్మగ్లర్లు ఇప్పుడు బాటమార్చి ఎలాంటి ఇబ్బంది లేకుండా పని జరిగేందుకు బస్సులపై ఆధారపడడంతో అక్రమ వస్తువుల రవాణా ఆర్టీసి బస్సుల్లో భద్రంగా జరిగిపోతోంది. ఇటీవల బస్సుల్లో దొరికిన గంజాయి తదితర వస్తువులు ఇందుకు ఉదాహరణ. జిల్లాలో గంజాయి రవాణా ఇటీవల కాలంలో అధికమయ్యింది. బయటి జిల్లాల నుంచి ఇక్కడికి వస్తున్న దీనిని జిల్లాలోని వివిధ ప్రాంతాలతోపాటు తమిళనాడు తదితర ప్రాంతాలకు తరలించేందుకు స్మగ్లర్లు బస్సులను ఎంచుకొంటుండడంతో ఈ అక్రమ రవాణా గుట్టుచప్పుడు కాకుండా జరుగుతోంది. ఇటీవల తడ చెక్‌పోస్టు వద్ద ఎక్సైజ్ పోలీసులు ఒక బస్సును తనిఖీ చేయడంతో అక్రమంగా తరలిస్తున్న 10 కిలోల గంజాయి బయటపడింది. అలాగే బియ్యం అక్రమంగా చిన్న చిన్న బస్తాల మాటున తరలిపోతోంది. పౌరసరఫరాశాఖ అధికారులు చేసిన తనిఖీల్లో ఒక బస్సులో ఇలాంటి బియ్యం బస్తాలు లభ్యం కావడంతో ఈ వ్యవహారం వెలుగు చూసింది. ఇలాంటివి బస్సుల్లో అధికంగా రవాణా జరుగుతున్నట్లు వార్తలొస్తున్నాయి. ముఖ్యంగా ఇతర రాష్ట్రాలకు, బయటి ప్రాంతాలకు వెళ్లే బస్సుల్లో ఈ అక్రమ రవాణా జరుగుతున్నట్లు సమాచారం. ఎవరు ఏమీ తీసుక వస్తున్నారో, ఆయా లగేజీల్లో ఏమి వుంటున్నాయో పరిశీలించే అవకాశం బస్సుల్లో కొరవడడంతో దీనిని ఆసరాగా చేసుకొని స్మగ్లర్లు ఇలాంటి అక్రమ రవాణాకు అనుకూలంగా మలచుకొని తమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. ఎప్పుడైనా పోలీసులు, ఇతర శాఖల అధికారులు తనిఖీలు చేసినపుడు ఈ అక్రమ రవాణా వ్యవహారం గుట్టురట్టవుతోంది తప్ప మిగతా సమయాల్లో ఎలాంటి ఆటంకాలు ఎదురు కాకుండా స్మగ్లింగ్ జరిగిపోతుంది.

# రాష్ట్రాన్ని అప్పులపాలు చేసిన వైఎస్!

## గూడూరులో సోమిరెడ్డి విమర్శ



రాష్ట్రం నానాటికి అప్పుల ఊబిలో చిక్కుకపోవడానికి కారణం వైఎస్ రాజశేఖర్‌రెడ్డేనని తెలుగు దేశంపార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. ఆయన పాపాలు ప్రజల పాలిట శాపాలయ్యాయని వ్యాఖ్యానించారు. ఇటీవల గూడూరు పట్టణంలో జరిగిన టిడిపి నియోజకవర్గ విస్తృతస్థాయి సమావేశంలో పాల్గొని ప్రసంగించారు. పార్టీ అభివృద్ధికి ప్రతి కార్యకర్త కృషి చేయాలని పిలుపునిచ్చిన ఆయన వైఎస్ జగన్, రాజశేఖర్‌రెడ్డిలపై విరుచుకుపడ్డారు. 2003లో తెలుగుదేశంపార్టీ అధికారంలో వున్నప్పుడు ఆర్థికస్థితి బాగాలేక హైదరాబాద్‌లో తనకున్న ఇంటిని రెగ్యులరైజ్ చేయాలని కోర్టుల చుట్టూ తిరిగిన వైఎస్ఆర్, ఆయన కుటుంబం 2004లో అధికారంలోకి రాగానే కోట్లకు పడగలెత్తిందని తెలిపారు. అవినీతి అక్రమార్జన చేసి కోట్లు గడించి, చేసిన తప్పులు బయటపడి జగన్ జైలులో వున్నాడన్నారు. అలాంటి జగన్‌ను విజయమ్మ నిర్దోషని, అమాయకుడని ఏ తప్పు చేయలేదని గుండెలు బాదుకోవడం విడ్డూరంగా వుందన్నారు. టిడిపి హయాంలో కరువు కాటకాలు ఏర్పడినప్పుడు రాష్ట్రంలో సాగునీటికి ఇబ్బందులు తలెత్తకుండా చూశామని, నేడు ప్రభుత్వం చేతకాని విధానాల వలన రైతులు తీవ్రంగా నష్టపోతున్నారన్నారు. 2వేల కిలోమీటర్ల పాదయాత్ర చేస్తున్న చంద్రబాబునాయుడిని ఆదర్శంగా తీసుకొని కార్యకర్తలు కష్టపడి పని చేయాలన్నారు. కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్‌లు కుమ్మక్కై టిడిపిని విమర్శించడాన్ని తీవ్రంగా ఖండించారు. ఆ పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర ఆ రెండు పార్టీలకు ప్రజలు తగిన గుణపాఠం చెప్పి తీరాలన్నారు. గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్, కోటేశ్వరరావు, రవీంద్రరెడ్డి, శశిధర్‌రావు, చక్రపాణి, విజయమోహన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# కొండ బిట్రగుంట బ్రహ్మోత్సవాలపై సమీక్ష!

## భక్తులకు సకల సౌకర్యాలు కల్పిస్తామంటున్న అధికారులు



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న కావలి ఆర్డీఓ.

కొండ బిట్రగుంట వెంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలకు హాజరయ్యే భక్తులకు ఎలాంటి అసౌకర్యం కలుగకుండా చూడాలని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు అధికారులకు సూచించారు. మద్యం విక్రయాలు, మాంసాహార అమ్మకాలు జరగకుండా కఠినంగా వ్యవహరించాలన్నారు. ఇటీవల ప్రసన్నుడి ఆలయంలో బ్రహ్మోత్సవాల ఏర్పాట్లపై సమావేశం జరిగింది. కావలి ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి, డిఎస్పీ ఇందిర, ఆలయ ఇఓ ప్రభాకర్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఎమ్మెల్యే ఈ కార్యక్రమంపై పలు సూచనలు సలహాలు అందజేశారు. ఎక్కడా అవాంఛనీయ సంఘటనలు జరగకుండా పోలీసులు కట్టుదిట్టంగా వ్యవహరించాలన్నారు. అల్లరి మూకలు, అసాంఘిక శక్తులను కఠినంగా అణచివేయాలని, మద్యం అమ్మకాలు జరగకుండా చూడాలని, వైద్యసేవలు అందుబాటులో వుంచాలని ఆయా శాఖల అధికారులకు తెలిపారు. ఆర్‌డిఓ మాట్లాడుతూ భక్తులకు త్రాగునీరు, స్నానాలకు అవసరమైన నీటిని అందించేందుకు చర్యలు తీసుకోవాలన్నారు. అగ్నిమాపక వాహనాన్ని అందుబాటులో వుంచాలన్నారు. ఈ సమావేశంలో పాల్గొన్న మాజీ సర్పంచ్ రఘు మాట్లాడుతూ గతంలో అధికారులు తగినవిధంగా వ్యవహరించడనందున మద్యం, మాంస విక్రయాలు జరిగిన విషయాన్ని ఈ సందర్భంగా ప్రస్తావించగా ఆర్‌డిఓ ఈసారి అలా జరుగదని గట్టి హామీ ఇచ్చారు. ఆలయ కార్యనిర్వహణాధికారి ప్రభాకర్ మాట్లాడుతూ భక్తులకు ఎలాంటి అసౌకర్యం కలుగకుండా అన్ని చర్యలు తీసుకొంటున్నట్లు వివరించారు.

● సాగునీటిపై

# నెల్లూరు ఆర్డీఓ సమీక్ష!

సోమశిల దక్షిణ కాలువ క్రింద సాగు చేస్తున్న పంటలన్నింటికీ సమానంగా సాగునీరు అందించి రైతులను ఆదుకోవాలని నెల్లూరు ఆర్‌డిఓ మాధవీలత సోమశిల ప్రాజెక్టు అధికారులను ఆదేశించారు. ఇటీవల ఆమె అధికారులతో కలిసి చేజర్ల మండలం నుంచి సోమశిల ప్రాజెక్టు వరకు దక్షిణ కాలువ వెంబడి పర్యటించారు. ఈ సందర్భంగా

**సోమశిల దక్షిణ కాలువపై కలియతిరిగిన అధికారిణి**

కొందరు రైతులు అక్రమంగా మోటార్లను పెట్టి నీటిని వాడుకొంటున్నారనే విషయమై వచ్చిన ఫిర్యాదులపై స్పందిస్తూ తక్షణం వాటిని తొలగించాలన్నారు. అధికారులు బృందాలుగా ఏర్పడి ఇలాంటి అక్రమాలను అరికట్టి రైతులు నష్టపోకుండా చూడాలన్నారు. ఆర్‌డిఓ వెంట కలువాయి తహశీల్దార్ హుస్సేన్, సోమశిల ప్రాజెక్టు ఎస్ఇ సోమశేఖర్, ఇఇ రాజగోపాల్, డిఇలు, జెఇలు పాల్గొన్నారు.

బిజెపి జిల్లా కార్యదర్శిగా

# సుధాకర్!

● ఆత్మకూరు వాసిని మూడోసారి వరించిన పదవి



బిజెపి జిల్లా ప్రధాన కార్యదర్శిగా ఆత్మకూరుకు చెందిన కుడుముల సుధాకర్ ఎన్నికయ్యారు. ఆయన ఈ పదవి చేపట్టడం మూడోసారి. విద్యార్థి దశ నుంచే నాయకత్వ లక్షణాలు కలిగిన సుధాకర్ ఎబివిపి, ఆర్ఎస్ఎస్‌లో చురుకైన పాత్ర పోషించాడు. విఆర్ కళాశాల సెక్రటరీగాను పనిచేసిన ఆయన జాతీయనేత వెంకయ్యానాయుడు తదితరులతో సన్నిహితంగా మెలుగుతూ పలు ఎన్నికలలో బిజెపి అభ్యర్థుల విజయానికి కృషి చేసి వున్నారు. ఈ పదవి చేపట్టడంపై ఆత్మకూరు ప్రాంత బిజెపి కార్యకర్తలు హర్షం వ్యక్తం చేస్తున్నారు.

● వెంకటగిరిలో

# పోలీస్ సబ్ కంట్రోల్ రూమ్!

వెంకటగిరి క్రాస్‌రోడ్డు వద్ద పోలీస్ సబ్ కంట్రోల్ రూమ్ ఏర్పాటైంది. గుంటూరు రేంజ్ ఐజి రవిగుప్త ఇక్కడకు విచ్చేసి ఈ కంట్రోల్ రూమును ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పట్టణ జనాభా 60వేలకు పెరగడంతో సబ్ కంట్రోల్ రూమ్‌ను ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ఫిర్యాదులు, ఇతర సమస్యలపై కంట్రోల్ రూమ్‌కు సమాచారమివ్వవచ్చన్నారు. పట్టణంలో రెండో పోలీస్‌స్టేషన్ అవసరం వుందని, దీని ఏర్పాటుకు కృషి చేస్తున్నామన్నారు. పట్టణ పరిధిలో గల పోలీస్ స్టేషన్‌లో సిబ్బంది కొరతపై మాట్లాడుతూ పూర్తిస్థాయిలో సిబ్బంది నియామకం జరుపుతామన్నారు. ఎస్పీ రమణకుమార్ మాట్లాడుతూ పోలేరమ్మ జాతరలో జంతుబలులు జరగకుండా చేయడంలో

**ప్రారంభించిన గుంటూరు రేంజ్ ఐజి!**

సఫలమయ్యామన్నారు. పట్టణ ఎస్ఐగా నాలుగేళ్లుగా విధులు నిర్వహిస్తూ ప్రజల నుంచి మంచి పేరు తెచ్చుకొన్న ఎస్ అన్వర్‌బాషాను ఐజి సత్కరించారు. ఇందులో డిఎస్పీ హనుమంతరావు, సిఐ శ్రీనివాసరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# యానాం ఎమ్మెల్యే పాదయాత్ర!

## నియోజకవర్గ ప్రజల కోసం నిస్వార్థ యాత్ర

నియోజకవర్గ ప్రజల అభివృద్ధిని కాంక్షిస్తూ యానాం శాసనసభ్యుడు మల్లాడి కృష్ణారావు తిరుమలకు పాదయాత్ర చేపట్టారు. యానాం నుంచి కుటుంబ సభ్యులు, మిత్రులతో కలిసి తిరుమలకు పాదయాత్రగా బయలుదేరిన ఆయన ఇటీవల నెల్లూరుజిల్లా కోవూరుకు చేరుకొన్నారు. ఈ సందర్భంగా ఆయన పాదయాత్ర విశేషాలను విలేకరులతో ముచ్చటించారు. నియోజకవర్గ ప్రజలు సుఖసంతోషాలతో వుండాలని, అభివృద్ధి చెందాలని కోరుకొంటూ వెంకటేశ్వర స్వామి దర్శనానికి తిరుమలకు పాదయాత్రగా వెళ్తున్నానన్నారు. ఫిబ్రవరి 13న ఈ పాదయాత్ర చేపట్టామని, ప్రతి ఏడాది ఈ యాత్ర చేపట్టడం ఆనవాయితీ అని తెలిపారు.

# వెతికిమరీ గిరిజనులకు అంత్యోదయ కార్డులు!

జిల్లాలో గిరిజనులకు అంత్యోదయ రేషన్‌కార్డులను అందించేందుకు సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) శ్రీకారం చుట్టింది. ప్రధానంగా గ్రామీణ ప్రాంతాల్లో చెరువు కాల్వగట్లపై నివాసాలు ఏర్పాటు చేసుకొని జీవిస్తున్న వారిని గుర్తించే పనిలో వున్నారు. జిల్లావ్యాప్తంగా అన్ని గిరిజన కాలనీల్లో ఈ కార్యక్రమాన్ని అమలు చేయాలని ఐటిడిఏ ప్రాజెక్టు అధికారి యాకసిరి వెంకటేశ్వర్లు తెలిపారు. ఇప్పటికే 23 మండలాల్లో 14 వేల గిరిజన కుటుంబాలకు అంత్యోదయ రేషన్ కార్డులు అందచేయడం జరిగిందన్నారు. సాధారణ రేషన్‌కార్డు పొంది వున్న వారి వివరాలను సేకరించి పౌరసరఫరాలశాఖ ద్వారా కార్డులను జారీ చేస్తున్నట్లు వివరించారు. అంత్యోదయ కార్డు ద్వారా ప్రతినెల 35 కిలోల బియ్యం

**సెహబాష్ పిఓ వెంకటేశ్వర్లు**

కుటుంబానికి అందుతాయన్నారు. ప్రతి గిరిజన కాలనీకి స్వయంగా తన సిబ్బందితో వెళ్లి అంత్యోదయ కార్డుల కోసం దరఖాస్తులు తీసుకుంటున్నారు. ఐటిడిఏ జిల్లా కేంద్రంలో ఏర్పాటు చేసి దాదాపు 12 సంవత్సరాలు కావస్తుంది. ఈ కాలంలో పిఓగా వచ్చిన ఏ అధికారి కూడా గిరిజన కాలనీలకు వెళ్లి వారి సమస్యలు అడిగి తెలుసుకున్న దాఖలాలేవు. ప్రస్తుత పిఓ వెంకటేశ్వర్లు గిరిజనుల సమస్యల పరిష్కారం కోసం ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళ్లి కృషి చేస్తున్నారు. ప్రభుత్వం గిరిజనుల సంక్షేమం కోసం విడుదల చేస్తున్న కోట్ల రూపాయల నిధులు ప్రక్కదారి పట్టకుండా వారికే ఖర్చు చేసేందుకు ప్రణాళికను రూపొందించి అమలు చేస్తున్నారాయన.



నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస హైస్కూల్‌లో జరిగిన ఎడ్యుఫెస్ట్ - 2013లో విండ్ పవర్ ప్రాజెక్ట్ గురించి వివరిస్తున్న స్కూల్ విద్యార్థులు.



నెల్లూరులోని హోటల్ సింహపురి వ్యవస్థాపకులు సన్నపరెడ్డి వెంకటరెడ్డి తొమ్మిదవ వర్ధంతి సందర్భంగా హోటల్ వద్ద ఏర్పాటు చేసిన సంస్మరణ కార్యక్రమంలో సన్నపరెడ్డి శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన కృష్ణారెడ్డి, సుధాకర్‌రెడ్డి, సుకేష్‌రెడ్డి, విజయకుమార్‌రెడ్డి తదితరులున్నారు.

# ఉపయోగపడని సీమాంక్ సెంటర్!

మాతా శిశు మరణాలు తగ్గించాలనే ఆశయంతో గూడూరు ఏరియా ఆస్పత్రిలో ఏర్పాటుచేసిన సీమాంక్ సెంటర్ నామమాత్రమైంది. ఖరీదైన పరికరాలు లక్షల రూపాయలు వెచ్చించి ఏర్పాటు చేసినప్పటికీ తగిన సిబ్బందిని నియమించకపోవడంతో ఈ కేంద్రం ప్రజలకు ఉపయోగపడడం లేదు. స్థానిక ఏరియా ఆస్పత్రిలో ఐదేళ్ల క్రిందట ఈ సీమాంక్ సెంటర్‌ను ఏర్పాటు చేశారు. కానీ తగిన సిబ్బంది లేక కేంద్రం ఏర్పాటుచేసిన లక్ష్యం నెరవేరకుండా పోతోంది. ఇందుకు ఇటీవల జరిగిన ఘటనే ఉదాహరణ. సైదాపురం మండలం తూర్పుపూండ్ల గ్రామానికి చెందిన పుల్లమ్మ అనే మహిళ ఇటీవల మగ బిడ్డను ప్రసవించింది. ఆ పసిగొడ్డుకు అత్యవసర చికిత్స అవసరమైంది. తక్షణ వైద్యంగా ఇంక్యుబేటర్ అవసరం ఏర్పడింది. ఆ పరికరం సీమాంక్ సెంటర్‌లో వున్నప్పటికీ వినియోగంలో లేకపోవడం, తగిన నైపుణ్యం గల సిబ్బంది లేకపోవడంతో వెంటనే ప్రైవేట్ ఆస్పత్రికి తీసుకెళ్లాల్సి వచ్చింది. అక్కడకు తీసుకెళ్లేలోగా పసిబిడ్డ మృతి చెందింది. దీంతో వారి కుటుంబ సభ్యులు ప్రభుత్వ ఆస్పత్రి వైద్యులపై ఆగ్రహం వ్యక్తం చేస్తూ ఆందోళనకు దిగారు. వైద్యులు మాత్రం ఇందులో తమ తప్పేమీ

### గూడూరులో ఇదీ పరిస్థితి!

లేదని చేతులు దులుపుకొన్నారు. అత్యాధునిక పరికరాలున్నా తగిన సిబ్బంది లేకపోవడంతో అంగట్లో అన్ని వున్నా అల్లుడి నోట్లో శని అన్నచందంగా వుంది సీమాంక్ సెంటర్ పరిస్థితి. ఇప్పటికైనా జిల్లా అధికారులు స్పందించి తగిన సిబ్బందిని నియమించాలని ఈ ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

## ప్రజా సమస్యలపై పోరాడండి!

### పార్టీ శ్రేణులకు కావలి ఎమ్మెల్యే సలహా.



పార్టీ పదవుల కోసం గ్రూపులను వీడి ప్రజా సమస్యలపై దృష్టిసారించాలని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు తెలుగుదేశంపార్టీ శ్రేణులకు హితబోధ చేశారు. వర్గాలుగా విడిపోయి కలహించుకోవడం వలన పార్టీ పలుచనవుతుందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ఐక్యంగా వుంటూ ప్రజల పక్షాన నిలచి సమస్యలపై పోరాటం చేస్తే భవిష్యత్తు వుంటుందన్నారు. ఇటీవల ఆయన నియోజకవర్గ పరిధిలోని బోగోలు తదితర మండలాల్లో పర్యటించి మండలస్థాయి నేతలకు, కార్యకర్తలతో సమావేశం అయ్యారు. ఈ సందర్భంగా కార్యకర్తలకు అండదండలు అందిస్తానంటునే తన అభిప్రాయాలను కుండబద్దలు కొట్టినట్లు చెప్పారు. ప్రజల్లోకి వెళ్లకుండా, నా చుట్టూ చేరి ఆహా ఓహో అంటే ఉపయోగం లేదని అది అందరికి చేటు తెస్తుందన్నారు. ప్రజల్లో వుంటే పదవులు వాటంతట అవే వస్తాయని వాటి కోసం ప్రాకులాడాల్సిన అవసరం లేదని సుతిమెత్తగా మందలించారు. రాబోయే స్థానిక సంస్థల ఎన్నికల్లో కార్యకర్తలు సమిష్టిగా కృషి చేసి ప్రతి పంచాయితీలో తెలుగుదేశం జెండా ఎగురవేయాలన్నారు. అనంతరం పార్టీపరంగా స్థానిక సంస్థల ఎన్నికల్లో అనుసరించాల్సిన వ్యూహాలను పార్టీ నేతలతో చర్చించారు. ఈ కార్యక్రమంలో మండల పార్టీ నేతలు మాలేపాటి సుబ్బానాయుడు, ఆత్మకూరు బ్రహ్మయ్య, వాసు తదితరులు పాల్గొన్నారు.

● అస్తవ్యస్థంగా

## గూడూరు ట్రాఫిక్

గూడూరులో ట్రాఫిక్ అస్తవ్యస్థంగా మారింది. వాహనాల రాకపోకలపై నియంత్రణ లేకపోవడం, పోలీసు తగిన చర్యలు చేపట్టడంలో విఫలం కావడంతో పట్టణంలో ట్రాఫిక్ పరిస్థితి దారుణంగా తయారైంది. ఏ వాహనాలు ఎటునుంచి వస్తున్నాయో, ఏవైపు నుంచి పోతున్నాయో తెలియని పరిస్థితి ఏర్పడుతోంది. దీనికి తోడు పార్కింగ్ సమస్య పట్టి పీడిస్తోంది. ఇది చాలదన్నట్లు సిమెంటురోడ్డు నిర్మిస్తుండడంతో ఈ సమస్య మరింత జటిలమైంది. సాయిబాబా మందిరం నుండి సంగం థియేటర్ వరకు, హైస్కూల్ నుంచి బజారువీధి వరకు సిమెంటు రోడ్డు నిర్మిస్తున్నారు. అలాగే కోర్టు సెంటర్ నుంచి నెల్లటూరు వరకు తారురోడ్డు నిర్మాణం జరుగుతోంది. దీంతో ఆ మార్గాలలో రాకపోకలు నిలచిపోయాయి. వీటికి ప్రత్యామ్నాయ మార్గాలు చూపకపోవడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పట్టణంలోకి వచ్చే అన్ని మార్గాల్లో రోడ్లు నిర్మిస్తుండడంతో బయటి డిపోల నుంచి వచ్చే బస్సులు చిల్లకూరు బైపాస్ రోడ్డు కూడలి వద్దే నిలచిపోతున్నాయి. దీంతో ప్రయాణీకులు రెండు కిలోమీటర్ల మేర పోయి బస్సులు ఎక్కాల్సి వస్తుండడంతో తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. ఇంత జరుగుతున్నా పోలీసులు తగిన చర్యలు చేపట్టకపోవడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

## బోర్ల ద్వారా సాగునీరు!

పొదలకూరు మండలం భోగసముద్రం రైతులు సాగు చేసిన పంటలకు బోర్ల ద్వారా సాగునీటిని సరఫరా చేస్తామని నెల్లూరు ఆర్‌డిఓ మాధవీలత తెలిపారు. ఈ ప్రాంతంలో 150 ఎకరాల ఆయకట్టుకుగాను 600 ఎకరాల్లో వరిసాగు చేశారు రైతులు. నీటి సరఫరా చేయలేమని రెవెన్యూ, ఇరిగేషన్ అధికారులు చెప్పినా రైతులు సాగు చేయడంతో సాగునీటికి ఇబ్బందులు తలెత్తాయి. ఈ పరిస్థితుల్లో దిక్కుతోచని రైతాంగం జిల్లా కలెక్టర్‌ను కలసి పంటలు కాపాడాలని మొరపెట్టుకొన్నారు. దీనికి స్పందించిన కలెక్టర్ ఆర్‌డిఓ మాధవీలతను సమస్య పరిష్కరించాల్సిందిగా ఆదేశాలు జారీ చేశారు. ఎస్టీకాలనీలో బోర్ల నుంచి జనరేటర్ల సహాయంతో మోటార్ల ద్వారా సాగునీటిని అందిస్తామని భరోసా ఇచ్చారు. అవసరమైతే వున్న బోర్లకు అదనంగా మరో రెండు బోర్లను వేసైనా నీటి సరఫరాకు ఆటంకాలు లేకుండా చేస్తామని హామీ ఇవ్వడంతో రైతులు సంతోషించారు. ఇకనైనా రైతులు సాగుచేపట్టే ముందు నీటి సామర్ధ్యాన్ని గుర్తించి దానికి తగినట్లు పంటలు వేసుకోవాలని సూచించారు. లేకపోతే ఇలాంటి ఇబ్బందులే ఎదురౌతాయని సుతిమెత్తగా మందలించారు.

● గిరిజనులు

# చైతన్యవంతులు కావాలి!

### కావలిలో జరిగిన ఐక్యవేదిక ఆకాంక్ష

ప్రభుత్వాలు ఎన్ని సంక్షేమ పథకాలు చేపడుతున్నా గిరిజనుల బతుకులు మారడం లేదని గిరిజన ఐక్యవేదిక ఆవేదన వ్యక్తం చేసింది. ఏళ్లు గడుస్తున్నా గిరిజన కుటుంబాలు అభివృద్ధికి నోచుకోక దుర్భర జీవితం గడుపుతున్నాయన్నారు. ఇటీవల కావలిలో ఐక్యవేదిక నాయకులు విలేకరుల సమావేశం నిర్వహించారు. ప్రభుత్వం పలు సంక్షేమ పథకాలు అమలు చేస్తున్నా అధికారుల్లో చిత్తశుద్ధి కొరవడడంతో అవి నిష్ప్రయోజనం అవుతున్నాయన్నారు. ఇప్పటికీ జిల్లాలో గిరిజనులకు రేషన్‌కార్డులులేవని, నివేశన స్థలాలు, పక్కాగృహాలు, వృద్ధాప్య పింఛన్లకు నోచుకోకుండా వున్నారని తెలిపారు. గిరిజనులు చైతన్యవంతులైతేనే ఈ సమస్యలకు పరిష్కారం లభిస్తుందన్నారు. జీవన స్థితిగతులు మారాలన్నా, ప్రభుత్వ సంక్షేమ ఫలాలు అందాలన్నా ప్రతి గిరిజనుడు చైతన్యంతో వ్యవహరించాలని పిలుపునిచ్చారు. హక్కులను కాపాడుకొనేందుకు గిరిజనులంతా సంఘటితమై ఉద్యమించాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో గిరిజన ఐక్యవేదిక జిల్లా అధ్యక్షుడు బాపట్ల వెంకటపతి తదితరులు పాల్గొన్నారు.

# నాయుడుపేట రైల్వే స్టేషన్‌లో తనిఖీ!

### లోపాలను ఎత్తిచూపిన డిఆర్ఎం ఏకె.మిశ్రా

నాయుడుపేట రైల్వేస్టేషన్‌ను ఆశాఖ డిఆర్ఎం ఏకె మిశ్రా ఇటీవల తనిఖీ చేశారు. స్టేషనంతా కలియదిరిగిన ఆయన త్రాగునీటి సౌకర్యాన్ని, పారిశుధ్యాన్ని పరిశీలించారు. స్టేషన్ అపరిశుభ్రంగా వుండడంపై సిబ్బందిపై అసంతృప్తి వ్యక్తం చేశారు. కొత్తగా చేపట్టిన ఫ్లాట్‌ఫాం పనులను పరిశీలించారు. వేగవంతంగా పనులు చేయడంతో పాటు నాణ్యతా ప్రమాణాలు పాటించాలని సూచించారు. ఈ సందర్భంగా స్థానికులు ఆయన్ను కలసి సమస్యలను విన్నవించారు. రిజర్వేషన్ కౌంటర్ వున్నా తాత్కాలిక టిక్కెట్లు పొందలేకున్నామని తెలిపారు. ఈ ప్రాంతం నుంచి మద్రాసుకు, ఇటు నెల్లూరు వైపు అధికసంఖ్యలో ప్రయాణీకులు నిత్యం పయనిస్తుంటారని వివరించారు. దీనిని దృష్టిలో వుంచుకొని పినాకిని, నవజీవన్, జనశతాబ్ది, భువనేశ్వర్ తదితర రైళ్లను ఈ స్టేషన్‌లో నిలపాలని కోరారు. ప్రజలు తెలిపిన వినతులపై డిఆర్ఎం స్పందిస్తూ ఈ విషయాన్ని ఉన్నతాధికారుల దృష్టికి తీసుకొనిపోయి సమస్య పరిష్కారానికి కృషి చేస్తామన్నారు. ఈ తనిఖీల్లో డిఆర్ఎం వెంట ఏడిసిఎం ఉషా, వేణుగోపాల్ తదితరులు పాల్గొన్నారు.

# రాజీవ్ విద్యామిషన్ నేతృత్వంలో ఆటల పోటీలు!



**బహుమతులు పంచిన ఎమ్మెల్యే మస్తాన్‌రావు**

కావలి పట్టణంలో గల జవహర్ భారతి క్రీడా మైదానంలో జిల్లా స్థాయి కస్తూర్బా గాంధీ అంతర్ పాఠశాల క్రీడా పోటీలు ఇటీవల ఘనంగా జరిగాయి. స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు జ్యోతి ప్రజ్వలనతో ఆరంభమైన ఈ పోటీల్లో విశ్వోదయ రెక్టార్ దొడ్ల వినయ్ కుమార్ రెడ్డి, రాజీవ్ విద్యామిషన్ పిడి కోదండ రామిరెడ్డి పాల్గొని ప్రసంగించారు. మహాత్మాగాంధీ సతీమణి కస్తూర్బాగాంధీ పేరిట ఆమె స్ఫూర్తితో ఈ పాఠశాలలను స్థాపించడం ముదావహం అన్నారు. సమాజ సేవ చేయడం, పది మందికి సహాయ పడడం, ముఖ్యంగా అనాథలను ఆదుకోవడం ప్రతి ఒక్కరి బాధ్యతన్నారు. క్రీడల ముగింపు కార్యక్రమంలోను పాల్గొన్న ఎమ్మెల్యే మస్తాన్‌రావు మాట్లాడుతూ చదువుతోపాటు క్రీడలు పిల్లలకు అవసరం అన్నారు. వీటివల్ల శారీరక, మానసిక ధారుఢ్యం ఏర్పడుతుందన్నారు. బిఎంఆర్ చారిటబుల్ ట్రస్టు తరపున క్రీడల నిర్వహణకు, క్రీడాకారుల ప్రోత్సాహానికి తగిన సహాయ సహకారాలు అందిస్తామని హామీ ఇచ్చారు. సొంత నిధులతో విజేతలకు 10వేల రూపాయలను, రన్నర్‌కు 5వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని ప్రకటించారు. ఈ కార్యక్రమంలో రాజీవ్ విద్యామిషన్ ఎఎంఒ రవి ప్రసాద్, భారతి, రమణా రెడ్డి, పద్మావతి నాయుడు రాంప్రసాద్, గారంశెట్టి వేణుగోపాల్, మాల్యాద్రి, ప్రసాద్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# కోవూరు చుట్టుప్రక్కల అక్రమ లేఅవుట్ల హవా!

**పట్టించుకోని అధికారులు**

కోవూరు నియోజకవర్గంలో అక్రమ లేఅవుట్లు ఇబ్బడి ముబ్బడిగా వెలుస్తున్నాయి. ప్రభుత్వ నిబంధనలను ఖాతరు చేయకుండా లేఅవుట్లు వేస్తున్నా సంబంధిత శాఖలు పట్టించుకోకపోవడంతో వీరిది ఇష్టారాజ్యం అయ్యింది. కోవూరు, నార్తు రాజుపాళెం, రేగడిచెలిక, బుచ్చి, ఇందుకూరుపేట తదితర ప్రాంతాలలో పచ్చని పంటపొలాలు ప్లాట్లుగా మారిపోయాయి. ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారం నిబంధనలకు అనుగుణంగా లేఅవుట్లు వేయాల్సి వున్నా వాటిని పట్టించుకోకుండా అక్రమంగా లేఅవుట్లు వేసి ప్లాట్లు విక్రయించేస్తుండడంతో ప్రభుత్వానికి రావాల్సిన కోట్లాది రూపాయల ఆదాయం రాకుండా పోతోంది. రియల్ ఎస్టేట్ వ్యాపారులు కొందరు ప్రభుత్వ స్థలాలను ఆక్రమించేసి లేఅవుట్లు వేసేస్తున్నారు. అరకొర సౌకర్యాలతో ప్లాట్లు వేసి అమ్మకాలు సాగిస్తున్న వ్యాపారులపై ఆయా శాఖలు ఎలాంటి చర్యలు చేపట్టక పోతుండడంతో అక్రమ లేఅవుట్ల వ్యాపారం జోరుగా సాగుతోంది.

# అయ్యవార్లు గ్రూపులు కడితే సహించం!

**డిప్యూటీ డిఇఓ చంద్రిక**

పలువురికి ఆదర్శంగా ఉండాల్సిన ఉపాధ్యాయులు గ్రూపులు కట్టి గొడవలకు దిగడం సిగ్గుపడాల్సిన విషయమని జిల్లా ఉప విద్యాశాఖాధికారి చంద్రిక వ్యాఖ్యానించారు. ఇప్పటికైనా వారు తీరు మార్చుకోకపోతే క్రమ శిక్షణా చర్యలు తప్పవని ఆమె హెచ్చరించారు. ఇటీవల సర్వేపల్లి హైస్కూల్‌లో ఉపాధ్యాయుల మధ్య గొడవలు జరిగి అవి కాస్త ఘర్షణకు దారి తీసిన పరిస్థితులపై విచారణ చేపట్టిన డిప్యూటీ డిఇఓ పైవిధంగా మాట్లాడారు. ప్రభుత్వ పాఠశాలలను బలోపేతం చేసేందుకు, విద్యార్థుల సంఖ్య పెంచేందుకు ప్రభుత్వం కృషి చేస్తున్నాదన్నారు. అందులో భాగంగానే మధ్యాహ్నభోజన పథకాన్ని పాఠశాలల్లో ఏర్పాటు చేశారన్నారు. ఇంత చేస్తున్నా ప్రభుత్వపాఠశాలల్లో విద్యాబోధన సరిగా లేదని ప్రైవేట్ పాఠశాలల వైపు పిల్లలు మొగ్గు చూపుతున్నారన్నారు. ఉపాధ్యాయులు తమ పనితీరు మార్చుకోవాలని, గ్రూపులు, తగాదాలకు స్వస్తిపలికి చక్కని విద్యాబోధన చేసి పిల్లలను అన్ని రకాలుగా తీర్చిదిద్దాలన్నారు. పదోతరగతి పరీక్షల్లో నూరుశాతం ఉత్తీర్ణత లక్ష్యంగా ఉపాధ్యాయులు పని చేయాలన్నారు. అనంతరం వివిధ తరగతుల విద్యార్థులతో ఆయా సబ్జెక్టులపై మాట్లాడడంతోపాటు పాఠశాలలో ఉపాధ్యాయుల ప్రవర్తనపైనా ఆరా తీశారు. ఈ విచారణలో డిప్యూటీ డిఇఓతోపాటు మండల విద్యాధికారి రవీంద్రరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# వాళ్లు కుమ్మక్కయ్యారు!

**కాంగ్రెస్, వైకాపాలను విమర్శించిన బీద రవిచంద్ర**



కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు కుమ్మక్కు రాజకీయాలు చేస్తున్నాయని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవి చంద్ర విమర్శించారు. ఇటీవల జరిగిన సహకార ఎన్నికలే అందుకు నిదర్శనం అన్నారు. కావలి పట్టణంలోగల ఉదయగిరి నియోజకవర్గ తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో ఇటీవల విలేకరులు సమావేశం నిర్వహించి ఆ రెండు పార్టీలపై విరుచుకుపడ్డారాయన. ఆర్థికమంత్రి రామనారాయణ రెడ్డి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ వారికి ఎరేస్తే, ఆ పార్టీ వారు హోల్‌సేల్‌గా అమ్ముడుపోయారని ఆరోపించారు. అలాంటి వారు తెలుగుదేశం పార్టీ కుమ్మక్కు రాజకీయాలు చేస్తుందని అనడం దొంగే దొంగ దొంగ అన్న చందంగా వుందని దుయ్యబట్టారు. సహకార ఎన్నికల్లో నేరుగా గెలవలేక అడ్డదారులు తొక్కిన కాంగ్రెస్ పార్టీకి, అన్ని స్థానాల్లో గెలిచేశారుతామని విర్రవీగి చతికిలబడ్డ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి తెలుగుదేశం పార్టీని విమర్శించే అర్హత లేదన్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అసమర్థపాలన సాగుతోందన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేసిన పాపాల వల్ల రాష్ట్ర ప్రజలు దుర్భర జీవనం సాగిస్తున్నారన్నారు. అన్ని వస్తువుల ధరలు పెరిగి ప్రజలు అల్లాడుతున్నారన్నారు. రాష్ట్రాన్ని అప్పుల ఊబిలో వుంచుతూనే పన్నులు, సర్‌ఛార్జీల పేరుతో అదనపు భారం మోపుతూ సామాన్యుడి బ్రతుకు చిద్రం చేస్తున్నారన్నారు. ఈ సమావేశంలో ఉదయగిరి నియోజకవర్గ టిడిపి ఇన్‌ఛార్జ్ బొల్లినేని రామారావు, వెంకటాద్రి, మస్తాన్‌రెడ్డి, బలరామిరెడ్డి, తటపర్తి వాసు, ప్రసాదరావు, పెంచలయ్య, బ్రహ్మయ్య తదితరులు పాల్గొన్నారు.

# ఎన్నో వైశిష్ట్యాల మాసం ఫాల్గుణం!



శ్రీ మహావిష్ణువుకు అత్యంత ప్రీతికరమైన మాసం ఫాల్గుణమాసం. చైత్రాది మాసాల క్రమంలో చిట్టచివరి మాసం ఫాల్గుణ మాసం. దీని తర్వాత కొత్త సంవత్సరం ఆరంభమవుతుంది. శిశిర రుతువుకు ముగింపు పలికి వసంతానికి స్వాగతం చెప్పే ఈ మాసంలో శ్రీహరిని అర్చించినట్లయితే విశేషమైన పుణ్యఫలం లభిస్తుందంటారు. ఈ మాసంలో శుక్ల పక్ష పాడ్యమి నుంచి ద్వాదశి వరకు వచ్చే మొదటి పన్నెండు రోజులు శ్రీవిష్ణుమూర్తిని పూజించడానికి ఉత్కృష్టమైన రోజులుగా పురాణాలు పేర్కొంటున్నాయి. ప్రతిరోజు తెల్లవారుజామునే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, తలస్నానం చేసి సూర్యభగవానునికి అర్ఘ్యం ఇచ్చిన తర్వాత శ్రీ మహావిష్ణువును షోడశోపచారాలతో, అష్టోత్తరాలతో పూజించినట్లయితే సకల శుభాలు కల్గుతాయంటారు. ఫాల్గుణ మాసానికి విష్ణువుకు వున్న సంబంధాన్ని భాగవతంలో వివరించబడింది.

శ్రీహరి ఆరాధనతోపాటు ఎన్నో వ్రతాలు, నోములకు నెలవైన మాసం ఫాల్గుణం. ఉత్తర ఫాల్గుణి నక్షత్రంతో కూడుకున్న పూర్ణిమ వున్న ఈ నెలలో వివిధ దేవతలకు సంబంధించి ఆచరించాల్సిన వ్రతాలు, చేయాల్సిన పూజలను పురాణాలలో వివరించబడ్డాయి. ఈ మాసంలో వచ్చే పూర్ణిమ శక్తితో కూడుకొన్నది. ఏ సంవత్సరంలోనైనా పూర్ణిమ, ఉత్తర ఫాల్గుణి కలిసి వస్తే ఆరోజున శ్రీ మహాలక్ష్మిని ఆరాధించాలంటారు. లక్ష్మీ దేవిని అష్టోత్తర శతనామాలు, కనకధార స్తోత్రాలను పారాయణం చేయడం వల్ల ఆర్థిక ఇబ్బందులు తొలగి కుటుంబంలో సుఖశాంతులు నెలకొంటాయని పురాణాలు చెప్తున్నాయి. పలు ప్రాంతాలలో ఫాల్గుణ పూర్ణిమను ఘనంగా నిర్వహిస్తారు. దీనికి సంబంధించి ఒక పురాణ గాథ ఒకటి వుంది. ఒకనాడు పార్వతి తన ప్రభావం చేత పరమేశ్వరుడి కళ్లు మూతపడేటట్లు చేసింది. శివుడి కళ్లు మూతలుబడడం వల్ల జగమంతా అంధకార బంధురమైంది. అప్పుడు మహేశ్వరుడు కోపగించుకోవడంతో అలిగిన పార్వతి కాంచీపురానికి వచ్చి తిరిగి శివుడి అభిమానాన్ని పొందేందుకు ఒక మామిడి చెట్టు క్రింద కూర్చొని తపస్సు చేసింది. దీనికి సంతోషించిన పరమేశ్వరుడు పార్వతిని అనుగ్రహించాడు. ఆనాటి నుంచి ఫాల్గుణ పూర్ణిమ ఉత్సవాన్ని కాంచీపురంలో వేడుకగా నిర్వహిస్తారు.



ఫాల్గుణ మాసంలో వచ్చే ప్రతి తిథిలోను ఒక్కో వ్రతం చేస్తారు. ఫాల్గుణ శుద్ధ పాడ్యమినాడు భద్ర చతుష్టయం. విదియనాడు మధూకం వంటి వ్రతాలు చేస్తారు. అలాగే ఫాల్గుణ శుద్ధ చవితి నాడు అవిఘ్న గణపతి వ్రతాన్ని ఆచరిస్తారు. పంచమినాడు అనంతపంచమి వ్రతం, సప్తమి నాడు అర్కసంపుట సప్తమీవ్రతం, అష్టమి, నవమి, ఏకాదశులలో లక్ష్మీకాంతి దేవీ వ్రతం, ఆనంద నవమి వ్రతం, ఆమలక ఏకాదశి, గోవింద ద్వాదశివ్రతం, చతుర్దశి నాడు మహేశ్వర వ్రతం చేస్తారు. వీటితో పాటు ఈ మాసంలో వచ్చే ఫాల్గుణ శుద్ధ ద్వాదశిని నృసింహ ద్వాదశి అంటారు. శ్రీ మహావిష్ణువు ఎత్తిన దశావతారాల్లో ఒకటైన నృసింహస్వామిని ఆరోజున పూజించినట్లయితే అష్టైశ్వర్యాలు చేకూరుతాయంటారు. అలాగే ద్వాదశినాడు గంగాస్నానం చేసినా పాపాలు తొలగుతాయని చెప్తారు. సర్వదేవతా వ్రత సమాహారంగా చెప్పబడే ఫాల్గుణ మాసం ఎన్నో వైశిష్ట్యాలకు నెలవైనది.



సరికొత్త పథకం

# ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక అమలుకు ఏర్పాట్లు సిద్ధం!

**ఈ యేడాది ఏప్రెల్ నుంచి అమలయ్యే ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక ద్వారా ఈ వర్గాలకు చెందిన 32 లక్షల మందికి ఇతర వర్గాలతో సమానంగా సామాజిక హోదా కల్పించడం, ఆర్థిక, విద్యా, మానవ వనరుల అభివృద్ధిలో భాగస్వామ్యం, భద్రత కల్పించడంతోపాటు వీరి సమగ్రాభివృద్ధికి కృషి చేయడం కోసం జిల్లా అధికార యంత్రాంగం పటిష్టమైన ప్రణాళికను సిద్ధం చేసింది.**

రాష్ట్రప్రభుత్వం ఈ ఆర్థిక సంవత్సరం నుంచి ఎస్సీ, ఎస్టీ ఉపప్రణాళిక ద్వారా నిధులు కేటాయించి అమలు చేయడానికి శ్రీకారం చుట్టింది. ఏప్రెల్ 2013 నుంచి అమల్లోకి వచ్చే ఈ చట్టం పది సంవత్సరాలపాటు అమల్లో వుంటుంది. ఎస్సీ, ఎస్టీ వర్గాలకు ఇతరులతో సమానంగా సామాజిక హోదా కల్పించడం, ఆర్థిక, విద్య, మానవ వనరుల అభివృద్ధిలో భాగస్వామ్యం, భద్రత కల్పించడంతోపాటు ఆయా వర్గాల సమగ్రాభివృద్ధికి కృషి చేయడమే దీని ప్రధాన ఉద్దేశ్యం. దేశంలోనే తొలిసారిగా ఉపప్రణాళిక చట్టాన్ని తీసుకురావడం ద్వారా మన రాష్ట్రం ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకంగా నిలుస్తుంది. జిల్లాలో ఎస్సీ, ఎస్టీ జనాభాకు అనుగుణంగా ప్రణాళిక కేటాయింపులుంటాయి. ఆయా వర్గాల అభివృద్ధికి ఆటంకంగా వున్న లోటుపాట్లను పూడ్చడానికి ఉద్దేశించే పథకాలను, ప్రత్యక్షంగా, గణనాత్మకమైన ప్రయోజనాలను అందించే వాటిని ఇందులో చేర్చారు.

ఎస్సీ, ఎస్టీలకు ఇతర బలహీన వర్గాలకు మధ్య ఉన్న అంతరాలను తొలగించేందుకు ఆయా వర్గాలకు ప్రత్యక్ష, నాణ్యమైన లబ్ధిని చేకూర్చేందుకు చర్యలు తీసుకుంటారు. రాష్ట్రస్థాయిలో సిఎం అధ్యక్షతన ఎస్సీ, ఎస్టీ అభివృద్ధి మండలి ఏర్పాటు చేయడం జరిగింది. సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమశాఖల మంత్రుల ఆధ్వర్యంలో నోడల్ ఏజెన్సీని ఇప్పటికే ఏర్పాటు చేశారు. జిల్లాస్థాయిలో ఉపప్రణాళిక అమలు జరిగే తీరును జిల్లా కలెక్టర్ అధ్యక్షతన పర్యవేక్షక సంఘాన్ని ఏర్పాటు చేస్తారు. నోడల్ ఏజెన్సీ, జిల్లా పర్యవేక్షక కమిటీ ఈ పథకం క్రింద చేపట్టే కార్యకలాపాలలో కీలక భూమిక నిర్వర్తిస్తాయి. వివిధ శాఖలను సమన్వయపరచడంతోపాటు ఖర్చుల విషయంలో పారదర్శకత పాటిస్తాయి. ఉపప్రణాళికల నిధుల ఖర్చుపై సోషల్ ఆడిట్ సదుపాయాన్ని కలుగజేస్తుంది. నోడల్ ఏజెన్సీ ఇచ్చిన ఆదేశాలను ప్రభుత్వశాఖలు విధిగా పాటించి తీరాలన్న నిబంధన విధించారు.

కొత్తచట్టం అమల్లోకి వచ్చాక ఈ చట్టం క్రింద కేటాయించే నిధులు దారి మళ్లించేందుకు గానీ, ఖర్చు చేయని నిధులు మురిగిపోయేందుకు గానీ అవకాశం ఉండదు.

### జిల్లాలో 32లక్షలమందికి ప్రయోజనం

ఎస్సీ, ఎస్టీ ఉపప్రణాళిక నిధుల ద్వారా నెల్లూరుజిల్లాలో దాదాపు 32 లక్షల మందికిపైగా ప్రయోజనం పొందే అవకాశం వుంది. 2011 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం ఎస్సీలు 29లక్షల 66వేల 82 మంది, ఎస్టీలు 2లక్షల 52వేల 759మంది వున్నట్లు అధికారిక లెక్కలు చెబుతున్నాయి. ఇప్పటివరకు వివిధ ప్రభుత్వశాఖలు ఎస్సీ, ఎస్టీల సంక్షేమం కోసం ప్రభుత్వం కేటాయించిన నిధుల్లో 15శాతం ఖర్చు చేయాల్సి వుండేది. కొన్నిశాఖలు 15శాతం నిధుల్ని ఆయా వర్గాలకు ఖర్చు చేసిన దాఖలాలు కూడా లేవు. ప్రస్తుతం ఉప ప్రణాళిక చట్టం అమల్లోకి రావడంతో నేరుగా నిధులు ఖర్చు చేయనున్నారు.

సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమశాఖల ఆధ్వర్యంలో ఎస్సీ, ఎస్టీల అభివృద్ధికి భారీ ఎత్తున నిధులు ఖర్చు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. అయితే ఉప ప్రణాళిక చట్టంలో పేర్కొన్న విధంగా నిధులు విడుదల చేయనిదే ఖర్చు చేసేందుకు వీలుపడదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎస్సీ, ఎస్టీల సంక్షేమం కోసం కేటాయించే నిధులు కాగితాలకే పరిమితం కాకుండా విడుదల చేస్తే అందరూ హర్షిస్తారని దళిత సంఘాల నేతలు అభిప్రాయపడుతున్నారు. 2013-14 ఆర్థిక సంవత్సరం నుంచి అమల్లోకి రానున్న ఈ చట్టం అమలు కోసం జిల్లా యంత్రాంగం అన్ని ఏర్పాట్లు చేసుకుంటుంది. 27తేది ఈ పథకం గూర్చి ఎస్సీ, ఎస్టీ ప్రజలకు తెలిపేందుకు ఒక ప్రచార రథాన్ని జిల్లా కలెక్టర్ శ్రీధర్ రెడ్డి ప్రారంభించడం విశేషం.



● నడికుడి - శ్రీకాళహస్తి రైల్వే లైనుకు

# మోక్షం కల్పించిన టిఎస్సార్!

## రైల్వే శాఖ నుంచి ప్రణాళికా సంఘానికి ఫైల్.

నెల్లూరుజిల్లా ప్రజానీకం దశాబ్దాల కాలంగా ఎదురుచూస్తున్న నడికుడి - శ్రీకాళహస్తి రైల్వే లైన్ నిర్మాణానికి మోక్షం కల్పించడానికి కంకణం కట్టుకొన్నాడు రాజ్యసభ సభ్యుడు తిక్కవరపు సుబ్బరామరెడ్డి. ఇటీవల జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో ఆయన దృష్టికి ఈ విషయం వచ్చింది. ఎన్నికల తర్వాత ఈ అంశాన్ని తాను ఢిల్లీ స్థాయిలో కదిలిస్తానని హామీ ఇచ్చాడాయన. దానికి అనుగుణంగా ఆ ఎన్నికలలో ఓడిపోయినప్పటికీ, ఇచ్చిన హామీ నిలబెట్టుకోవడానికి తన కృషి మొదలు పెట్టాడు. కేంద్ర రైల్వేమంత్రి బన్సాల్‌ను కలిసి, నచ్చచెప్పి, ప్రణాళిక సంఘం ప్రతిపాదనలలో దీన్ని పరిశీలింప చేయడానికి అనుమతి సాధించాడు. ఏ కొత్త ప్రాజెక్ట్ చేపట్టాలన్నా మొదటగా ప్రణాళికా సంఘం అనుమతి కావాలి. వారు అన్ని సాధ్యాసాధ్యాలను విపులంగా పరిశీలించి, దానివల్ల వచ్చే ఆర్థిక సాధక బాధకాలను అంచనా వేసి అనుమతి ఇస్తే కానీ రైల్వే శాఖ కొత్త ప్రాజెక్ట్‌లు చేపట్టలేదు. ఆ సూక్ష్మం తెలిసినవాడు కాబట్టే సుబ్బరామరెడ్డి గారు ఈ ప్రాజెక్ట్ ప్రతిపాదన రైల్వే శాఖ నుంచి ప్రణాళికా సంఘానికి వెళ్లే ఏర్పాటు చేశాడు.



శ్రీకాళహస్తి - నడికుడి రైల్వే మార్గం ప్రతిపాదన 1978లో మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు వెలుగులోకి వచ్చింది. 1979 తుఫాను వల్ల విజయవాడ - మద్రాసు రైల్వే మార్గం దెబ్బ తినడంతో రైళ్ల రాకపోకలకు తీవ్ర అంతరాయం జరిగింది. తరచు తుఫాన్లు వచ్చే కోస్తా తీరానికి ప్రత్యామ్నాయంగా మరొక మార్గం వుండాలని ప్రతిపాదించారు. దాని ప్రకారం శ్రీకాళహస్తి నుంచి ఆత్మకూరు, ఉదయగిరి, పామూరు, కనిగిరి, వినుకొండ వంటి మెట్ట ప్రాంతాల మీదుగా నడికుడి వరకు కొత్త రైల్వే లైన్ నిర్మించాలని కోరారు. ఆ తర్వాత ఎందరెందరో దాన్ని ముందుకు కదిలించాలని చూసినా రైల్వే మంత్రులు విన్పించుకోలేదు. మధ్యలో ఒకసారి సర్వే కోసం మాత్రం నిధులిచ్చారు. ఆ సర్వే పూర్తి అయ్యి చాలా కాలమైంది. ఈ రైల్వే లైన్ నిర్మాణం వల్ల మెట్ట ప్రాంతాలు బాగుపడడంతోపాటు తమిళనాడుకు, ఉత్తరాదికి ఒక వారధిగా ఉపయోగపడగలదని, సరకు రవాణా ఖర్చు తగ్గుతుందని, ఈ లైన్ నిర్మించడానికయ్యే ఖర్చుకు కనీసం ఏటా 15 శాతం వరకు పెట్టుబడి రాబడి వస్తుందని అంచనా వేశారు. ఆ మాత్రం రాబడి అంటే రైల్వేకు పెద్ద లాభం క్రిందే లెక్క. అయితే రాజకీయంగా రైల్వే మంత్రులందరూ ఉత్తరాది వారే వస్తుండడంతో దక్షిణాది ప్రాజెక్ట్‌ల మీద వారికి శ్రద్ధ వుండడం లేదు. అందువల్లనే ఇన్ని దశాబ్దాలుగా ఇది పెండింగ్‌లో వుండిపోయింది. దానికి మోక్షం కల్పిస్తానని చెప్తున్నాడు సుబ్బరామరెడ్డి. ఆ కృషిలో ఆయన సఫలీకృతుడైతే ఈ మూడు నాలుగు జిల్లాల ప్రజలు ఆయన్ను శాశ్వతంగా గుర్తు పెట్టుకొంటారు.

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు







శ్రీ సి.కళ్యాణ్
ప్రముఖ సినీ నిర్మాత



శ్రీ అమరావతి కృష్ణారెడ్డి
రాష్ట్ర హోటల్స్ అసోసియేషన్ ఉపాధ్యక్షులు



శ్రీ ఎ.వి.యస్.
ప్రముఖ సినీ హాస్యనటులు, రచయిత, దర్శకులు





# వారఫలాలు

తేది 16-3-2013 నుండి 22-3-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; కుంభంలో బుధుడు, శుక్రుడు 17తేది వరకు తదుపరి మీనంలో; మీనంలో రవి, కుజులు; మేష, వృషభ, మిథున, కర్కాటకాలలో చంద్రుడు సంచరిస్తారు.




ప్రథమార్ధం సామాన్యంగా జరిగినా, ద్వితీయార్ధంలో ఊహించని ఖర్చులు, శారీరక, ఆర్థిక ఇబ్బందులు, బంధుమిత్రులతో వాదనలు, వ్యవహార నష్టాలు, కుటుంబ వ్యక్తులతో అభిప్రాయ భేదాలుంటాయి. ఉద్యోగులు తమ పై అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. వ్యవసాయదారులకు కొద్దిగా అనుకూలం. కళా, క్రీడా రంగాల వారు గత కొంతకాలంగా పడుతున్న బాధలు కొంతమేర తగ్గుతాయి.




చాలా యోగదాయకమైన వారం. తలపెట్టిన పనులన్నీ సకాలంలో పూర్తవుతాయి. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. గతంలో వున్న సమస్యలు పరిష్కారమౌతాయి. కుటుంబంలో భార్యాభర్తల మధ్య అవగాహన, వ్యవహార లాభం వుంటుంది. నూతన వస్తు, వాహనాల కొనుగోలు ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగులకు ఆర్థికాదాయాలు మెరుగుపడతాయి. విద్యార్థులకు మిశ్రమ ఫలితాలుంటాయి.




అన్ని రంగాల వారికి అనుకూలం. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. శరీరారోగ్య లాభం. ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. విద్యార్థులు ధైర్యంగా ముందుకు సాగుతారు. నూతన వస్తు, వాహన సౌఖ్యం ఏర్పడగలదు. ఉద్యోగులకు కోరినచోట్లకు స్థాన మార్పు. స్త్రీ మూలక ధనలాభం. పెద్దవారితో పరిచయాలు ఏర్పడతాయి. వ్యవసాయదారులకు గతంలో కన్నా మేలుగా వుంటుంది.




వారం మొదట్లో కొంత ఇబ్బందులున్నప్పటికీ క్రమేణా కష్టాలు తొలగి ఆనందం, సౌఖ్యం ఏర్పడతాయి. సోదరసోదరీమణులతో ఆనందాలు పంచుకుంటారు. శత్రుజయం. వృత్తి, వ్యాపారాలు లాభాల బాటన పడతాయి. విద్యార్థులు విద్యావకాశాలను మెరుగుపరచుకోవాలి. వ్యవసాయదారులు క్రమేపీ లాభాల బాటన పడతారు. కళా, క్రీడా రంగాలవారికి వాహన సౌఖ్యం, గృహమార్పులుంటాయి.




ఉద్యోగులకు స్థానమార్పులు, అనేక ఇబ్బందులుంటాయి. కోర్టు కేసులలో కష్టనష్టాలు, గృహ మార్పులతో చిక్కులేర్పడతాయి. ఊహించని ఖర్చులు, సమస్యలెదురవ్వడం వల్ల శారీరక ఆరోగ్యంలో లోపాలు ఏర్పడతాయి. కొందరు రహస్య జీవనం సాగిస్తారు. సోదరులతో వైరాలు, మాతృ లేదా పితృ వంశ సూతకాల వంటివి ఏర్పడతాయి. విద్యార్థులు తమ చదువులపై గట్టి కృషి అవసరం.




ఈవారం మిశ్రమ ఫలితాలుంటాయి. శారీరక శ్రమ వున్నప్పటికీ వ్యవహారానుకూలతలుంటాయి. సంతాన రీత్యా కొంత నష్టం, శత్రుమూలక ఇబ్బందులు ఏర్పడగలవు. విద్యార్థులకు ఇది పరీక్షా కాలం. వ్యవసాయ పనులలో సంబంధిత చిక్కులు, ధన వ్యయం ఏర్పడగలదు. కళా, క్రీడా రంగాల వారికి పై అధికారులతో ఇబ్బందులు, గొడవలు, ప్రభుత్వ సంబంధిత చిక్కులుంటాయి.

## పంచాంగం

16తేది శ్రీకంఠ జయంతి, పొట్టిశ్రీరాములు జయంతి.

17తేది భాను కృత్తిక, అలభ్యయోగ పుణ్యకాలం, ఉత్తరాభాద్ర కార్తె.

21తేది యాదగిరి గుట్ట లక్ష్మీనరసింహస్వామి కళ్యాణం.

22తేదిశాలిశక వత్సరాది.

### శుభ ముహూర్తాలు

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

ఫాల్గుణ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 16 | శని | పంచమి | తె | 04.39 గం.ల.వ |
| 17 | ఆది | షష్టి | | పూర్తిగా |
| 18 | సోమ | షష్టి | ఉ | 07.02 గం.ల.వ |
| 19 | మంగళ | సప్తమి | ప | 09.37 గం.ల.వ |
| 20 | బుధ | అష్టమి | ప | 12.10 గం.ల.వ |
| 21 | గురు | నవమి | ప | 02.24 గం.ల.వ |
| 22 | శుక్ర | దశమి | సా | 04.09 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




అన్ని రంగాల వారికి అన్నింటా జయం, లాభదాయకమే. వృత్తి, వ్యాపార రంగాల వారు నిలదొక్కుకుంటారు. ఆర్థికంగా లాభాలుంటాయి. వ్యవహార లాభాలు ఏర్పడగలవు. శత్రుజయం. విద్యార్థులు ధైర్యంతో ముందుకెళ్లడం, వాహన సౌఖ్యం ఏర్పడగలదు. నూతన మార్పులు, సంతాన సౌఖ్యం, ప్రయాణాలందు లాభాలు. వ్యవసాయదారులకు గతంలో కన్నా మేలు.




అన్ని విధాల యోగదాయకం. తలపెట్టిన పనులన్నీ సకాలంలో పూర్తవుతాయి. అన్నింటా జయం, ధైర్యంతో ముందుకు పోతారు. సంఘంలో పరపతి పెరుగుతుంది. గతంలో వాయిదాపడిన పనులు పరిష్కారమౌతాయి. కోర్టు కేసులు అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపారులు ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. విందులు, వినోదాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులు కష్టానికి తగ్గ ఫలితం పొందుతారు.




ఈవారం మీ మాటకు ఎదురులేదు. అనుకున్న పనులన్నీ నెరవేరుతాయి. కుటుంబంలో మీ మాటకు విలువిస్తారు. వ్యవహారానుకూలతలు సాధిస్తారు. నూతన వస్తు, వాహన, వస్త్రాభరణాలు కొంటారు. కళత్ర, కుటుంబ సౌఖ్యం. విద్యార్థులు తమ విద్యలలో అత్యధికత సాధిస్తారు. వ్యవసాయదారులు ఆర్థికాదాయాలు, కుటుంబ సౌఖ్యంతో ఆనందిస్తారు. రాజకీయులు మధ్యవర్తిత్వాలు మానుకోవాలి.




వ్యవహారానుకూలతలేర్పడి పనులన్నీ సకాలంలో పూర్తి చేస్తారు. ఇతరులకు సహాయం చేయడం, సమస్యల నుండి బయటపడడం, గౌరవ మర్యాదలు పెరగడం, ఆరోగ్యం మెరుగుపడటం వుంటుంది. నూతన కార్యాలకు శ్రీకారం చుడతారు. నిలచిపోయిన మొండి బకాయిలు వసూలవుతాయి. వృత్తి, వ్యాపారాలు లాభాల బాటన పడతాయి. కోర్టు వ్యవహారాలు మీకనుకూలంగా వుంటాయి.




వార ప్రారంభంలో తలపెట్టిన పనులలో కొంత చీకాకు వున్నప్పటికీ క్రమంగా తొలగి వ్యవహారానుకూలతలు సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. ఆర్థిక నిలకడ వుంటుంది. బంధుమిత్రులతో తమ సంతోషాలు పంచుకుంటారు. విందులు, వినోదాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులు తమ పనులలో అప్రయత్న లాభాలు పొందుతారు. కళా, క్రీడా రంగాల వారికి వాహన సౌఖ్యం కలదు.




తలపెట్టిన పనులు వాయిదాపడుట, సమస్యలు, చీకాకులుంటాయి. ఉద్యోగులకు స్థానమార్పులు తప్పక పోవచ్చు. కోర్టు కేసులు వాయిదా కోరడం మంచిది. విద్యార్థులకు ఇది పరీక్షా కాలం. ఏకాగ్రత అవసరం. కళా, క్రీడా రంగాలలోని వారు అనుకోని సమస్యలలో ఇరుక్కొనుట, తగాదాలు వుంటాయి. రాజకీయులకు అందరితో విరోధాలు, ప్రతి రోజూ ఏదో ఒక సమస్య వుంటుంది.

# వాస్తు పురుష అంగములపై దేవతా 'ఆవాహన' బ్రహ్మసృష్టి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ రాజీవనేత్ర — బెంగుళూరు*

* *వాస్తు పురుషుని గురించి చెప్పండి?*

అంధకాసుర సంహార సమయంలో శివుని జట నుంచి రాలిన స్వేద బిందువు మహాభూత మైనపుడు బ్రహ్మ దాని ముఖం ఈశాన్యం వైపు ఉండేలా దాన్ని భూగోళంలో నిక్షిప్తం చేశాడు. అది లేయకుండా ఇరవై అయిదు శరీరభాగాలపై దేవతలు ఆవహించేలా చేశాడు. ఆ భూతమే వాస్తు పురుషుడయినాడు.

*టి.కె.ఎం — చిత్తూరు*

* *మావారు మారుతారా?*

మీ సుదీర్ఘమైన లేఖ చదివాను. మీరు భయపడకండి. యంత్ర ప్రతిష్ట, రత్నధారణ నేను ఉత్తరంలో చెప్పిన విధంగా చేయండి. మీవారి తీరు మారుతుంది.

*జె.సుధాకర్ — హైదరాబాద్*

* *మూఢం, కత్తెరలను గురించి చెప్పండి?*

వాస్తు విద్యార్థిగా ఉండి ఇలాంటి పదాల్ని మీరు వాడకూడదు. మౌఢ్యమి, కర్తరి అని చెప్పాలి. గురుమౌఢ్యమి, శుక్ర మౌఢ్యమి, వాస్తు కర్తరి, అగ్ని కర్తరి అని మౌఢ్యమి, కర్తరి కొన్ని విధాలు.

*షేక్ షరీదాబేగం — చిత్తూరు*

* *జ్యోతిష శాస్త్రంలో సంతానాన్ని ఎలా గణిస్తారు?*

పంచమ భావాధిపతి, గ్రహస్థితి రాశ్యాధిపతి, భావాధిపతి స్థితి నొందిన నక్షత్రాధిపతిని నిర్ణయించి బలీయమైన గ్రహం ఏ వర్గానికి చెందినదో తెలుసుకుని స్త్రీ, పురుష లింగాల్ని నిర్ధారణ చేస్తారు.

*ఎం.శాంభవీమూర్తి — కాకినాడ*

* *అమ్మాయి వివాహ విషయంలో గుణ మేళన వంటి ఇరవై ఎనిమిది అంశాల్ని తప్పక చూడాలా?*

రాశి, నక్షత్ర ఫలితాలు. నక్షత్ర వేధ వ్యతిరేకత వంటి విషయాల్ని చూడాలి. ఆ పై కుటుంబ సంస్కారాన్ని, వ్యక్తుల ప్రవర్తనను ముఖ్యంగా తీసుకోండి.

*సి.సుందరయ్యశాస్త్రి — ఒంగోలు*

* *వాస్తు, ఆగమ శాస్త్రాలు ఒకటేనా?*

వాస్తు గృహానికి, ఆగమం ఆలయానికి సంబంధించిన శాస్త్రాలు. తిరుమలలో 'బంగారు బావి' ఉన్న స్థలాన్ని ఆగమ శాస్త్రం అంగీకరించదు.

*టి.అనూరాధ — గుంటూరు*

* *పుట్టిన సమయాన్ని కచ్చితంగా బేరీజు వేయాలా?*

'స్టాఫ్ వాచ్'లాంటి సాధనంతో శిశువు మొదటి శబ్దాన్ని(కాన్పు జరిగిన వెంటనే) కొలవాలి. అలా చేయగలిగితే ఖచ్చితమైన జ్యోతిష నిర్ణయాలను ప్రకటించవచ్చు.

*డాక్టర్ శ్యాంసుందర్ — తిరుపతి*

* *యంత్రాల విధి, విధానాల్ని ప్రభావాల్ని గురించి తెలుసుకోవాలంటే ఏ గ్రంథాలు చదవాలి?*

అగస్త్య వాస్తు నుంచి శ్రీకృష్ణవాస్తు వరకూ గల వాస్తు గ్రంథాలలోని వాస్తు యంత్ర ప్రకరణలను చదవాలి. 'యంత్ర సారస్వత'మనే ప్రాచీన గ్రంథాన్ని పరిశీలించాలి.

*టి.వి.ఎన్ — తెనాలి*

* *తెలియక వృక్షాన్ని తీసివేశాము. ఆయన మంచాన పడ్డారు. పరిష్కారం చెప్పండి?*

వెంటనే పూర్తి వివరాలు తెలియజేయండి. యంత్రాన్ని సూచిస్తాను. ఆ తర్వాత మీరు వాస్తు దోష పూజను నిర్వహించి నూటొక్క మొక్కల్ని నాటి పోషించాలి.

*ఎన్.అరవయ్య — హైదరాబాద్*

* *నక్షత్రాన్ని బట్టి వ్యక్తిని గురించి మంచి చెడులు చెప్తారు.*

నక్షత్ర లక్షణాల విషయంలో శాస్త్రం కరెక్టే. అయితే వ్యక్తికి అవే లక్షణాలన్నీ ఉంటాయని చెప్పలేం. అయితే వాటిలోని ఏదో ఒక లక్షణం ఉండి తీరుతుంది.

*టి.ధనుంజయ — గుంటూరు*

* *ఇంటిలో అనేక సమస్యలు తీరడం లేదు. ఏం చేయాలి?*

వెంటనే వాస్తు దోషాలు సరిచేసుకోలేనప్పుడు. 28 మంత్రాలలో నిర్ధారించబడిన యంత్రాన్ని ప్రతిష్టించుకోండి. సమస్యలు అంతటితో ఆగిపోతాయి. తర్వాత నిర్మాణం విషయం చూసుకోవచ్చు.



కొత్తపట్నంలో పోలీసు పహారా మధ్య ప్రజాభిప్రాయ సేకరణకు వస్తున్న కలెక్టర్.

## ● కొత్తపట్నంలో

# తోళ్లపరిశ్రమ వద్దంటూ తిరగబడ్డ జనం!

**కోట మండలం కొత్తపట్నం గ్రామంలోని 530 ఎకరాల్లో 500 కోట్ల రూపాయల పెట్టుబడితో ఏర్పాటు చేయ తలపెట్టిన తోళ్ల పరిశ్రమ వల్ల తాము ఇబ్బందులను ఎదుర్కొంటున్నామన్న నిర్ణయానికి వచ్చిన గ్రామస్తులు ఈ పరిశ్రమను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. కానీ అధికారులు మాత్రం ఏదోవిధంగా ఏర్పాటు చేయాలని తలపెట్టి 6 వతేది అక్కడి ప్రజల చేత తన్నులు తినబోయి అదృష్టం బాగుండి తప్పించుకొని వచ్చారు.**

కోట మండలం కొత్తపట్నం గ్రామంలో ఏర్పాటు చేయదలచిన తోళ్ల పరిశ్రమకు వ్యతిరేకంగా ఇసుక, కారప్పొడితో స్థానిక ప్రజలు అధికారులపై తిరగబడ్డారు. కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో ఈ నెల 6వ తేదీన తోళ్ల పరిశ్రమ ఏర్పాటుకోసం ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం నిర్వహించేందుకు అధికారులు ప్రయత్నించారు. ఇప్పటికే రెండు దఫాలు ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని ప్రజలు వ్యతిరేకించిన సంగతి తెలిసిందే. కృష్ణపట్నం పోర్టు కంపెనీ ఆధ్వర్యంలో అంతర్జాతీయ తోళ్ల పరిశ్రమ ఏర్పాటుకు ప్రభుత్వం అంగీకరించింది. దీనికి అవసరమైన భూసేకరణ పూర్తిచేసి భూమలు కూడా అప్పగించారు. రెండు దఫాలు ప్రజల వ్యతిరేకతతో వాయిదా పడిన ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని పోలీసు బందోబస్తుతో నిర్వహించాలని అధికారులు భావించారు.

అధికారుల ఎత్తుగడను ముందుగానే పసిగట్టిన ప్రజా సంఘాల నేతలు సమీప గ్రామాల్లో పర్యటించి భారీ ఎత్తున జన సమీకరణ చేశారు. ఉదయం పది గంటలకే ప్రజలు కొత్తపట్నం గ్రామానికి చేరుకుని తోళ్ల పరిశ్రమకు వ్యతిరేకంగా నినాదాలు చేయడం ప్రారంభించారు. ఒక ప్రక్క సమీప గ్రామాల ప్రజలు, మరోప్రక్క పోలీసు బలగాలు మోహరించడంతో యుద్ధ వాతావరణం నెలకొంది. ఇక్కడకు వచ్చిన కలెక్టర్‌ను వెనుతిరిగి వెళ్లమని గ్రామస్తులు కోరారు.

### ఇసుక, కారప్పొడితో దాడి

తొమ్మిది గ్రామాల ప్రజలకు ఇబ్బంది కలిగించే విధంగా తోళ్ల పరిశ్రమను ఏర్పాటు చేయరాదని వ్యతిరేకిస్తున్నా అధికారులు మాత్రం కార్యక్రమాన్ని నిర్వహించడం ఏమిటంటూ మహిళలు ఇసుక, కారప్పొడిని అధికారులపై వెదజల్లారు. దీంతో ఖంగుతిన్న అధికారులు భయాందోళన చెందారు. జిల్లా చరిత్రలో ఇటువంటి సంఘటన ఎప్పుడూ ఎదుర్కోని అధికార యంత్రాంగం భయాందోళన చెందింది. జిల్లాలో అనేక పరిశ్రమలు ఏర్పాటు చేసినప్పటికీ ఇంతటి ఉద్రిక్త వాతావరణం మధ్య అభిప్రాయసేకరణ జరగలేదు. 530 ఎకరాల్లో 500 కోట్ల రూపాయల పెట్టుబడితో తోళ్ల పరిశ్రమను నెలకొల్పేందుకు కృష్ణపట్నం పోర్టు కంపెనీ తీవ్ర ప్రయత్నాలు చేస్తుంది. జిల్లాలో ఒక సామాజిక వర్గానికి చెందిన ప్రతినిధులతో చర్చలు జరిపి పరిశ్రమకు అనుకూలంగా ప్రకటనలు సైతం ఇప్పించుకోగలిగారు. ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం ఏర్పాటుచేసిన కొత్తపట్నం గ్రామానికి ఈ వర్గం ప్రతినిధులు కొందరు తరలివచ్చి అక్కడ ప్రజల ఆగ్రహాన్ని గమనించి గుట్టుచప్పుడు కాకుండా వెనుతిరిగారు. స్థానిక ప్రజలకు మద్దతుగా పౌరహక్కుల సంఘం, కుల నిర్మూలన పోరాట సమితి, సిపిఎం, బిజెపి ఇతర ప్రజా సంఘాల నేతలు తరలి వచ్చారు. జిల్లా కలెక్టర్ ఎంత ప్రయత్నించినా ప్రజలు ముందుకు రాకపోవడంతో కార్యక్రమాన్ని రద్దు చేస్తున్నట్లు ప్రకటించి తిరిగి వెళ్లారు. ఆందోళన కార్యక్రమంలో స్థానిక పాఠశాల విద్యార్థులు పాల్గొనడంతో కలెక్టర్ ఉపాధ్యాయులపై ఆగ్రహించి వారిపై కేసులు పెట్టమనడం వివాదాస్పదమయ్యింది.

### ప్రజల అభిప్రాయం గౌరవించాలి



తోళ్ల పరిశ్రమ ఏర్పాటును వ్యతిరేకిస్తున్న కొత్తపట్నం సమీప గ్రామాల ప్రజల అభిప్రాయాన్ని అధికారులు గౌరవించాలి. ఇప్పటికే రెండు దఫాలు అభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని వ్యతిరేకించడంతో వాయిదా వేశారు. పోలీసు సహకారంతో బలప్రయోగం చేసి కార్యక్రమాన్ని నిర్వహించానుకోవడం అప్రజాస్వామికం. పరిశ్రమను వ్యతిరేకిస్తూ వేలాది మంది వినతిపత్రాలు కలెక్టర్‌తోపాటు రాష్ట్ర ప్రభుత్వానికి పంపడం జరిగింది. 6వ తేది ప్రజలు మరింత ఆగ్రహించడానికి అధికారుల వైఖరే కారణం. రెచ్చగొట్టే విధంగా ఏమాత్రం వ్యవహరించినా శాంతి భద్రతల సమస్య తలెత్తి వుండేది. అన్ని ప్రజా సంఘాలు, రాజకీయ పక్షాల నేతలు సంయమనం పాటించడంతో పరిస్థితి సద్దుమణిగింది. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ ప్రజలు వెల్లడించిన అభిప్రాయాలను ప్రభుత్వానికి పంపాలి.

**ఎల్లంకి వెంకటేశ్వర్లు,** పౌరహక్కుల సంఘం జిల్లా కార్యదర్శి, నెల్లూరుజిల్లా.

**ఉపాధికి అవకాశం**

## ○ నిరుద్యోగులకు వరం

# ప్రధానమంత్రి ఉపాధి కల్పనా పథకం!

**గ్రామీణ ప్రాంతాలలో లభ్యమవుతున్న ముడి సరుకులను సమర్థవంతంగా ఉపయోగించి తక్కువ పెట్టుబడితో ఎక్కువ మందికి ఉపాధి కల్పిస్తూ గ్రామీణ అవసరాలు తీర్చే ఈ పథకంలో భాగంగా ఏదైనా ప్రాజెక్ట్ ఏర్పాటుకు 18 ఏళ్లు నిండి ఎనిమిదవ తరగతి పాసైన ప్రతి యువకుడు దరఖాస్తు చేయవచ్చు.**

ఖాదీ గ్రామీణ పరిశ్రమల విభాగం ఆధ్వర్యంలో ప్రధానమంత్రి ఉపాధి కల్పనా పథకం అమలు చేసింది. 2012–13 ఆర్థిక సంవత్సరం నుంచి ఈ పథకం జిల్లాలో అమలు చేస్తున్నారు. పథకం అమలుకు సంబంధించి ఇప్పటికే మార్గదర్శకాలు జారీ అయ్యాయి. అయితే దీని గురించి సరైన ప్రచారం కల్పించడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వైఫల్యం చెందాయి. గ్రామీణ ప్రాంతాలలో లభ్యమవుతున్న ముడి సరుకులను సమర్ధవంతంగా ఉపయోగించి తక్కువ పెట్టుబడితో ఎక్కువ మందికి ఉపాధి కల్పిస్తూ గ్రామీణ అవసరాలు తీర్చడమే ఖాదీ గ్రామీణ పరిశ్రమల ముఖ్య ఉద్దేశ్యం. గ్రామీణ ప్రాంతాల్లోని నిరుద్యోగులు పథకం గురించి తెలియక చిన్న పథకాల వైపు మొగ్గు చూపుతూ అవగాహన లేక ఆర్థికంగా నష్టపోతున్నారు.

ఈ పథకం కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో నడుస్తుంది. నిరుద్యోగులు ఏదైనా ప్రాజెక్ట్‌ను ఏర్పాటు చేయాలంటే 18 సంవత్సరాలు నిండి 8వ తరగతి పాసయ్యి వుండాలి. ఎటువంటి ఆదాయ పరిమితి లేదు. ప్రాజెక్ట్ వ్యయంలో సాధారణ లబ్దిదారులు 10 శాతం, ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీ, వికలాంగులు, మాజీ సైనికులు ఏడు శాతం పెట్టుబడిగా పెట్టాలి. ప్రాజెక్ట్ వ్యయంలో పట్టణ ప్రాంతాల్లోని సాధారణ లబ్దిదారులకు 15శాతం, గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారికి 25శాతం సబ్సిడీ వర్తించనుంది. ఇతర రిజర్వేషన్ కేటగిరిలకు చెందిన పట్టణ ప్రాంతాల వారికి 25 శాతం, గ్రామీణ ప్రాంతాలకు చెందిన లబ్దిదారులకు 35శాతం సబ్సిడీ అందిస్తారు. గతంలో పిఎంఆర్‌వై, గ్రామీణ ఉపాధి కల్పనా పథకాలు రెండింటిని కలిపి ప్రధానమంత్రి ఉపాధి కల్పనా పథకం (పిఎంఇజిపి)గా నామకరణం చేయడం జరిగింది. ఈ పథకం మంజూరుకు దరఖాస్తు చేసుకున్న లబ్దిదారులను జిల్లాస్థాయిలో టాస్క్‌ఫోర్సు కమిటీ ఎంపిక చేస్తుంది. ఈ కమిటీలో జిల్లా స్థాయి అధికారులు, బ్యాంకు ప్రతినిధులు సభ్యులుగా వున్నారు. ప్రభుత్వ రంగ బ్యాంకులతోపాటు ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు, ప్రైవేటు సెక్టార్ బ్యాంకులు రుణ సదుపాయం కల్పిస్తాయి. బ్యాంకులు గరిష్టంగా ఈ పథకం ద్వారా 25లక్షల రూపాయల వరకు మంజూరు చేయవచ్చు. బ్యాంకులు రుణం మంజూరు చేసిన అనంతరం ఖాదీ గ్రామీణ పరిశ్రమల విభాగం నుంచి మార్జిన్‌మనీ విడుదల చేస్తారు. మార్జిన్ మనీ మొత్తాన్ని మూడు సంవత్సరాల వరకు లబ్దిదారుని పేరు మీద ఫిక్స్‌డ్ డిపాజిట్ చేస్తారు. ఆ రోజు నుంచి ఇదే మొత్తానికి బ్యాంకు మంజూరు చేసిన రుణం నగదుకు వడ్డీ చెల్లించాల్సిన అవసరం వుండదు. పరిశ్రమ ఉత్పత్తి ప్రారంభించిన నాటి నుండి మూడు సంవత్సరాల తర్వాత నిబంధనలకు అనుగుణంగా నిర్వహిస్తున్నారా లేదా అని అధికారులు పరిశీలించిన అనంతరం మార్జిన్ మనీని సబ్సిడీగా మార్చి లబ్దిదారుని బ్యాంకు ఖాతాలో జమ చేస్తారు. ప్రధానంగా బ్యాంకులు ఈ పథకం ద్వారా ఏర్పాటు చేసే పరిశ్రమలకు రుణ సదుపాయం కల్పించాల్సి వుంటుంది.

### పరిశ్రమల వివరాలు

ఈ పథకంలో ఏడు రకాల పరిశ్రమలు చేర్చారు. గ్రామీణ పరిశ్రమలు, అటవీ సంబంధిత పరిశ్రమలు, వ్యవసాయ, ఆహార సంబంధిత పరిశ్రమలు, పాలిమర్స్, రసాయనిక పరిశ్రమలు, సాంకేతిక సహజ శక్తి, వస్త్ర పరిశ్రమ (ఖాదీయేతర), సేవా సంబంధిత పరిశ్రమలున్నాయి. ఇది పూర్తిగా కేంద్ర ప్రభుత్వ పథకం కావడంతో బ్యాంకులు ముందుకొస్తే ఎంతమందికైనా రుణాలు మంజూరు చేస్తామని ఆ శాఖాధికారులు చెబుతున్నారు. నిరుద్యోగులు తమకు పరిశ్రమ ఏర్పాటుపై పూర్తి అవగాహన కలిగి వుంచాలని కోరుతున్నారు. గ్రామీణ ప్రాంత యువకులు పథకం మంజూరుకు దరఖాస్తు చేసుకోగా, పట్టణ ప్రాంతాల వారు మాత్రం ముందుకు రావడం లేదు.

### నిరుద్యోగులకు వరం

ప్రధానమంత్రి ఉపాధి కల్పనా పథకం నిరుద్యోగులకు వరం లాంటిది. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో వివిధ పరిశ్రమలు ఏర్పాటు చేసుకొనేందుకు ఈ పథకం ఎంతో ఉపయోగపడుతుంది. జిల్లా టాస్క్‌ఫోర్సు కమిటీ ఆధ్వర్యంలో లబ్దిదారుల ఎంపిక జరుగుతుంది. బ్యాంకుల నుంచి రుణం మంజూరు చేస్తామని అంగీకార పత్రం తీసుకొచ్చినా కూడా యూనిట్లను మంజూరు చేయడం జరుగుతుంది. మండల స్థాయి అధికారుల ద్వారా గ్రామీణ ప్రాంతాల్లో ఈ పథకం గురించి విస్తృత ప్రచారం, అవగాహన కల్పించేందుకు చర్యలు తీసుకొంటున్నాము. నిరుద్యోగులు దీనిని ఉపయోగించుకొని పలువురికి ఉపాధి కల్పించడంతోపాటు ఆర్థికంగా నిలదొక్కుకొనేందుకు ముందుకు రావాలి.

**జె.డి.మనోహర్,** డిప్యూటీ డైరెక్టర్ ఖాదీ గ్రామీణ పరిశ్రమల శాఖ, నెల్లూరుజిల్లా.

## ఇష్టపడితేనే నటిస్తాను!

తాను తీసుకొనే ప్రతి నిర్ణయం కూడా తన మనసు నుంచి రావాల్సిందే తప్ప ఒకరు చెప్పారనో, ఇంకెవర్నో మెప్పించాలనో సినిమా ఒప్పుకోనంటుంది హీరోయిన్ టబు. ఇటీవల ఆమె నటించిన 'లైఫ్ ఆఫ్ పై' చిత్రానికి నాలుగు ఆస్కార్ అవార్డులు రావడంతో టబు ఎంతో ఆనందంగా ఉంది. ఈ సందర్భంగా మాట్లాడుతూ పాత్ర చిన్నదా పెద్దదా? సినిమా హాలీవుడ్దా బాలీవుడ్దా? హీరోయిన్ ప్రాధాన్యమున్న చిత్రమా వేరొకటా?? ఇలాంటివేమీ నేను చూడను. విన్నకథ ఆసక్తిగా ఉందా లేదా అని మాత్రమే పరిశీలిస్తాను. ఈ విషయంలో నాకు సరైన సమాధానం దొరికితే చాలు. ఇంకేమి ఆలోచించను. భావోద్వేగాలకు అనుగుణంగానే నా నిర్ణయాలు ఉంటాయి. ఇక ఆ ప్రయత్నం ఎలాంటి ఫలితం ఇచ్చినా సరే నేను మనస్ఫూర్తిగా స్వీకరిస్తుంటాను అని చెప్పుకొచ్చింది.



## పోలీస్ అధికారిగా రానా!

బాహుబలి చిత్రంలో హీరో ప్రభాస్‌తో దగ్గుబాటి రానా కత్తి యుద్ధాలు చేయబోతున్నారు. మరోవైపు రాణిరుద్రమలో కీలకపాత్ర పోషిస్తున్నాడు. ఈలోగా సోలో హీరోగానూ తన ప్రతాపం చూపించడానికి రెడీ అవుతున్నాడు. రచయితగా మారిన దర్శకుడు రవి వాంటెడ్ చిత్రంతో మెగాఫోన్ చేపట్టాడు. ఆ సినిమా పరాజయం పాలవ్వడంతో కాస్త విరామం తీసుకొన్నాడు. ఇప్పుడు మరో చిత్రం రూపొందించడానికి సన్నాహాలు చేస్తున్నాడు. ఇటీవల రానాకి ఓ కథ వినిపించినట్లు సమాచారం. రానా కూడా నటించను సంసిద్ధత వ్యక్తం చేశాడట. ఇందులో రానాను ఓ స్టైలిష్ పోలీస్ అధికారిగా చూపించనున్నారని సమాచారం.

## బికినీలో సోనమ్ కపూర్?



ఇప్పటివరకు పద్ధతైన పాత్రల్లోనే కనిపించింది సోనమ్ కపూర్. అందాలు ఆరబోసే అవకాశం రాలేదో, పాత్రలు అందుకు సహకరించలేదో తెలీదుగానీ తెరపై నిండుగా కనిపించింది. ఫ్యాషన్ షోల్లో మాత్రం రకరకాల దుస్తులను ధరించి చూపరుల మతి పోగొట్టింది. ప్రస్తుతం యశ్‌రాజ్ ఫిలిమ్స్ నిర్మిస్తున్న ఓ చిత్రంలో నటిస్తోంది. ఈ చిత్రంలో సోనమ్ బికినీ ధరిస్తుందన్న ప్రచారం జోరుగా జరుగుతుంది. యశ్‌రాజ్ సినిమాలు దోస్తానా, దివానా మస్తానా, ధూమ్ సినిమాల్లో హీరోయిన్లు బికినీల్లో దర్శనమిచ్చారు. ప్రస్తుతం సోనమ్ వంతు వచ్చింది. ఈ విషయమై తండ్రి అనిల్‌కపూర్ కూడా అడ్డుచెప్పలేదని సమాచారం. బికినీలో సోనమ్ ఎలా ఉంటుందో చూడాలంటే కొంతకాలం ఆగాలి.

## అతడు స్నేహితుడే!



స్నేహితులను దేవుడే నిర్ణయిస్తాడంటుంది హీరోయిన్ దీపికా పదుకొణే. తనకు రణవీర్‌సింగ్ దేవుడిచ్చిన స్నేహితుడంటుంది. దీపిక బాలీవుడ్‌లో ప్రేమికులను తరచూ మార్చే కథానాయికల జాబితాలో చేరింది. హీరో రణబీర్ కపూర్‌తో స్నేహం చేసింది. ఇప్పుడు రణవీర్‌సింగ్‌తో చనువుగా ఉంటుంది. విషయం ఏమిటని అడిగితే రణవీర్ సింగ్ నాకు స్నేహితుడు మాత్రమే. ఒక స్నేహితుడిలోని గొప్పదనాన్ని బయటకు చెప్పడం తప్పుకాదుకదా అని ప్రశ్నిస్తోంది. ఏ అండా లేకుండా తన సొంత కాళ్లపై నిలబడే వాళ్లంటే నాకు చాలా ఇష్టం. రణవీర్ కూడా కష్టపడి పైకొచ్చాడు. పెళ్లి గూర్చి ఇప్పట్లో ఆలోచించలేను. నా కెరీర్ ఇప్పుడిప్పుడే వేగంగా ముందుకెళ్తుంది. రణబీర్, వీర్ ఇద్దరిని కూడా స్నేహితులుగా చూస్తున్నా. మా అనుబంధాలు కొనసాగుతుంటాయని ముక్తాయించింది.

## దర్శకునిగా ఎ.ఆర్.రెహ్మాన్!



ఆస్కార్ వేదికపై భారతీయతను చాటిన స్వరకర్త ఎ.ఆర్.రెహ్మాన్. ప్రపంచవ్యాప్తంగా అభిమానులను సంపాదించుకొన్న ఈ సంగీత తరంగం ఇప్పుడు దర్శకత్వం వైపు దృష్టి సారించిందా? ఔననే అంటున్నాడు ఆయన సన్నిహితుడు అస్కార్ విజేత రసూల్ పూకుట్టి. ప్రస్తుతం రెహ్మాన్ లాస్ ఏంజిల్స్‌లో దర్శకత్వం, స్క్రిప్ట్ రచన విభాగాల్లో కోర్సు చేస్తున్నాడు. ఇప్పటికే రెహ్మాన్ కథా సంబంధమైన చర్చలు సాగిస్తున్నారని చెన్నై సినీవర్గాలు చెబుతున్నాయి. ఆయన ఎంచుకొన్న కథ సంజయ్ లీలా భన్సాలీ తీసిన బ్లాక్ అంత సున్నితమైనదని తెలిసింది. ప్రస్తుతానికి రెహ్మాన్ దీనిపై ఏమీ మాట్లాడం లేదు. అయితే రెహ్మాన్ దర్శకత్వంలో 2014లో చిత్రం తయారవుతుందని అప్పటికీ ఆయన స్వరాలు అందించేందుకు అంగీకరించిన చిత్రాలు పూర్తవుతాయని తెలిసింది.

## కళ్లకు కట్టినట్లుగా 26/11 ఇండియాపై దాడి!



అల్లూరు రహీం

నాగార్జున హీరోగా శివ చిత్రం తీసి తెలుగు సినీ పరిశ్రమలో ట్రెండ్‌సెట్టర్‌గా నిలిచాడు దర్శకుడు రాంగోపాల్ వర్మ. ఆ తర్వాత ఆయన కొన్ని తెలుగు చిత్రాలకు దర్శకుడుగా వ్యవహరించినా ఈ పరిశ్రమలో దర్శకునిగా కొనసాగలేకపోయాడు. బాలీవుడ్‌కు వెళ్లి 'రంగీలా'తో సూపర్‌హిట్ బాట పట్టాడు. ముంబాయిలోని అండర్‌వర్ల్డ్ డాన్‌ల కార్యకలాపాలపై ఆయన తీసిన 'సత్య', శివసేన అధినేత బాల్‌ధాకరే జీవితం ఆధారంగా తీసిన సర్కార్ చిత్రాలు సంచలనం సృష్టించాయి. చాలా స్పీడ్‌గా చిత్రాలు తీసే అలవాటున్న రామ్‌గోపాల్‌వర్మ హిందీలో చాలా చిత్రాలు తీశాడు. చిత్రం విడుదలకు ముందు ఏదో ఒక వివాదాన్ని జత చేసి సినిమాను మార్కెట్‌లోకి వదలడం రాంగోపాల్‌వర్మకు అలవాటు. కాని ఈ మధ్య ఆయన తీసిన సినిమాలు బాక్సాఫీసు వద్ద బోల్తాపడుతున్నాయి. హింసాత్మక చిత్రాలు తీయడంలో రాంగోపాల్‌వర్మ స్పెషలిస్ట్. రక్తచరిత్ర పేరుతో పరిటాల రవి, సూరి జీవితాలను స్వీకెల్‌గా తెరకెక్కించి నిర్మాతలు నష్టపోయేట్లు చేశాడు. తాజాగా ఇరోస్ ఇంటర్నేషనల్ పతాకంపై 26/11 ఇండియాపై దాడి చిత్రాన్ని తీశాడు. 2008 సంవత్సరం నవంబర్ 26వ తేది ముంబాయి మహానగరంపై లష్కరే తోయిబా సంస్థకు చెందిన ఉగ్రవాదులు చేసిన దాడులకు దృశ్యరూపం ఈ చిత్రం. 26/11 దాడుల్లో 166మంది అమాయకులు మరణించారు. 238మంది గాయపడ్డారు. ఈ దారుణ మారణకాండను రాంగోపాల్‌వర్మ కళ్లకు కట్టినట్లు చిత్రీకరించడంలో సఫలీకృతుడయ్యాడు. ఒక రకంగా చెప్పాలంటే ప్రేక్షకులు గుండె దిటవు చేసుకొని ఈ సినిమాను చూడాలి. ఈ చిత్రంలో రాంగోపాల్‌వర్మ ఉగ్రవాది కసబ్‌ను ముంబాయి జాయింట్ పోలీస్ కమిషనర్ విచారించే క్రమంలో ఉగ్రవాదులను అడిగే ప్రశ్నలు బాగున్నాయి. ఇస్లాం మతం ఏమి చెప్పింది? ప్రవక్త ఏమి చెప్పారు?? జిహాదీల పేరిట ఉగ్రవాదులు చేస్తున్నదేమిటి అన్న అంశాలపై కొనసాగిన తర్కం బాగుంది. ఒక్కసారి పవిత్ర గంధం చదివిన ముసల్మాన్ పొరపాటున గుడా తప్పుడు మార్గాన నడవడని చెప్పిన తీరు బాగుంది. ముంబాయి నరమేధంలో పాల్గొన్న తీవ్రవాదుల్లో కసబ్ మినహా మిగతావాళ్లు పోలీసులు, ఎన్.ఎస్.జి కమెండోల చేతుల్లో హతులయ్యారు. కసబ్‌ను చంపలేక, కోపాన్ని అణచుకోలేక ముంబాయి జాయింట్ పోలీస్ కమిషనర్ అతడ్ని లంజాకొడకా, చెత్తనా కొడకా అని తిట్టిన తీరు బాగుంది. ముంబాయిలో దాడుల పరంపర కొనసాగిన లీఫోర్డ్ కేఫ్, ఛత్రపతి శివాజీ టెర్మినల్, కామా హాస్పిటల్ సెట్టింగులను వాస్తవమనిపించేలా కళాదర్శకుడు ఉదయ్‌సింగ్ తీర్చిదిద్దిన తీరు బాగుంది. బడ్జెట్ పెరుగుతుందని కాబోలు తాజ్, ఒబరాయ్ హోటళ్ల సెట్టింగుల జోలికి మాత్రం వెళ్లలేదు. విచారణ సమయంలో, ఉరితీతకు ముందు కరడుగట్టిన తీవ్రవాది కసబ్‌లో మార్పు వచ్చినట్లు దర్శకుడు చూపిన తీరు అక్షేపనీయంగా వుంది. టెక్నాలజీని తన సినిమాల్లో బాగావాడే రాంగోపాల్ వర్మ అమర్‌మొహ్లీ రీకార్డింగ్, రవిచంద్రన్, హర్షరాజ్ చౌహన్ కెమెరాలతో తెరపై మెరుపులు మెరిపించాడు.

చిత్ర సమీక్ష

ఈ దారుణ నరమేధంపై ప్రభుత్వం ఏర్పాటుచేసిన కమిటీ ముందు ముంబాయి జాయింట్ పోలీస్ కమిషనర్ రాకేష్(నానా పటేకర్) తన వాంగ్మూలం ఇస్తుండగా చిత్రం ప్రారంభమవుతుంది. దాడుల సమయంలో ఉగ్రవాది కసబ్ విచారణలో నానా పటేకర్ ప్రదర్శించిన నటనా వైదుష్యాన్ని ప్రశంసించక తప్పదు. అదేవిధంగా కసబ్‌గా సంజీవ్ జైస్వాల్ నటన బాగుంది. అతుల్‌కులకర్ణితోపాటు పలువురు నటులున్నా వాళ్లు తళుక్కున మెరిసి మాయమైపోతుంటారు. చిన్నపిల్లల చేత కూడా రాంగోపాల్‌వర్మ మంచి నటనను రాబట్టుకొన్న తీరు ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిందే. మంచి కథ ఉంటే రాంగోపాల్ వర్మ మంచి సినిమా తీస్తాడని 26/11 ఇండియాపై దాడి సినిమా నిరూపించింది.

# సమస్యలపురిగా సింహపురి!

## గతమెంతో ఘనం

ప్రశాంతతకు మారుపేరైన నెల్లూరు నగరం ఇప్పుడు సకల సబ్బండు మోసాలు, నేరాలకు, ఘోరాలకు, అస్తవ్యస్థ పారిశుద్ధ్య పరిస్థితులకు, ట్రాఫిక్ చిక్కుముడులతో మాయగాళ్లతో భ్రష్టుపట్టిపోయింది. గతంలో ఎవరు, ఏప్రాంతం వారైనా నగరానికి వచ్చి ఉద్యోగ, వ్యాపారాలు చేసుకొనేందుకు అనువైన ప్రాంతమని భావించేవారు. మొలగొలకుల బియ్యానికి, కళలకు, సాంస్కృతిక సంస్థలు, కళాకారులకు, మేటైన రాజకీయ ఉద్దండులకు పేరుగడించింది. రానురాను సుందర సింహపురి కాస్త ముదనష్టంగా తయారైంది. పెరిగిన జనాభాకు తగినట్లు కనీస సౌకర్యాలు ఏర్పరచలేకపోవడం, వసతులు మెరుగు పరచకపోవడంతో వెనుకబడిపోయింది. ట్రాఫిక్ ఐల్యాండ్‌లు, లెక్కుమించి విగ్రహాలు, ఇరుకైన రోడ్లు, చెత్తాచెదారాలు, దుమ్ము, ధూళితో రోడ్లపై రావాలంటేనే భయపడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. దీనికి తోడు శాంతి భద్రతలు క్షీణించడం ప్రజలను కలవర పెడుతోంది. నగరంలో దొంగతనాలు పెరిగిపోయాయి. హత్యలు, చైన్‌స్నాచింగ్‌లు, వాహనాల దొంగతనాలు అధికం అయ్యాయి. ఆర్థిక మోసాలు పెరిగాయి. వ్యాపారులు మోసం అదనం. కూరగాయల దగ్గర్నుంచి పెట్రోల్ వరకు మోసాలే. మార్కెట్‌లో కూరగాయల తూకాల్లో మోసాలు జరుగుతుంటే, పెట్రోల్ కల్తీచేసి అమ్ముతూ మరికొందరు దగా చేస్తున్నారు. ఆహార పదార్థాలు, సరుకుల్లో కల్తీకి కొదవే లేదు. వీటన్నిటి నడుమ ఇరుకైన రోడ్లు, అడ్డదిడ్డంగా తిరిగే వాహనాలు, అస్తవ్యస్తమైన ట్రాఫిక్ నడుమ ఆరులక్షల నగర జనాభాతో పాటు వివిధ అవసరాలపై నగరానికి వచ్చే ప్రజలు పడే బాధలు అన్నిఇన్ని కావు. ప్రజాప్రతినిధులు, అధికారుల మాటలు నీటి మూటలుగా మారుతుంటే కల్తీలు, మోసాలు, దొంగతనాలు, ట్రాఫిక్ చిక్కుముడుల నడుమ సామాన్య పౌరులు బ్రతకలేక బ్రతకాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి.



జనం సహనాన్ని పరీక్షిస్తున్న ట్రాఫిక్ అబందర.

# బోర్డు తిప్పేసిన శైలాస్ చిల్డ్రన్స్ అకాడమీ!

## చిన్నారులకు ఎంత కష్టం?

పాఠశాల యజమానుల నిర్లక్ష్యానికి, లెక్కలేనితనానికి విద్యార్థులు బలైపోయారు. అట్టహాసంగా పాఠశాల ప్రారంభించి ఆర్భాటపు ప్రకటనలతో ఊదరగొట్టి నెల్లూరు వనంతోపుల్లో ఏర్పాటు చేసిన శైలాస్ చిల్డ్రన్స్ అకాడమి బోర్డు తిప్పేసింది. ఉన్నపళంగా స్కూలు మూసివేయడంతో అక్కడ చదువుతున్న విద్యార్థుల పరిస్థితి గందరగోళంగా మారింది. మూడేళ్ల క్రిందట ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా ఒక భవంతిలో కెజి నుంచి పదవతరగతి వరకు పాఠశాలను ప్రారంభించారు. అప్పుడే పలువురు పాఠశాల నిబంధనలకు విరుద్ధమని చెప్పినా విద్యాశాఖ పట్టించుకోలేదు. విదేశాలలో వుండే కుటుంబ సభ్యుల సహకారంతో సుమన్ అనే వ్యక్తి దీనిని నిర్వహిస్తూ వచ్చారు. విద్యార్థులను, వారి తల్లిదండ్రులను ఆకట్టుకొనేందుకు నగరంలో పేరు మోసిన స్కూళ్ల కంటే ఆడంబరంగా ప్రచారం నిర్వహించడంతోపాటు క్రీడా పోటీలు అట్టహాసంగా జరిపేవారు. అయితే పాఠశాల నిర్వహించి చక్కని విద్యాబోధన చేయాలన్న ఆలోచన లేకుండా లెక్కకుమించిన ఖర్చులు పెడుతూ తనను అందరూ గుర్తించాలని కరస్పాండెంట్ భావించడంతో ఆ పాఠశాలలో చదువుతున్న విద్యార్థులకు చిక్కులొచ్చి పడ్డాయి. ఆర్థిక భారం పేరుతో గత కొన్ని నెలలుగా పాఠశాలలో పనిచేసే టీచర్లు, ఇతర సిబ్బందికి జీతాలు చెల్లించకుండా విద్యార్థుల నుంచి ఫీజులు, ఇతరత్రా రూపాల్లో డబ్బులు వసూలు చేసుకోమని చెప్పేవారని పలువురు వాపోతున్నారు. మూడు నెలలుగా కరస్పాండెంట్ విద్యార్థుల బాగోగులు గాలికి వదిలేయడంతో వారి పరిస్థితి అయోమయంగా మారింది. ముఖ్యంగా పదవతరగతి పరీక్షలకు సిద్ధమవుతున్న విద్యార్థులు తీవ్రంగా ఆందోళన చెందుతున్నారు. నగరంలోని మరో పాఠశాల యజమానులతో ఈ పాఠశాలను అనుబంధంగా మార్చేందుకు ప్రయత్నించినప్పటికీ నిబంధనలు అడ్డు వస్తుండడంతో వాళ్లు వెనుకా ముందు ఆడుతున్నట్లు సమాచారం. ఇంత జరుగుతున్నా విద్యాశాఖ అధికారులు పట్టించుకోకపోవడంతో అందులో చదువుతున్న విద్యార్థుల పరిస్థితి గందరగోళంగా మారింది. కరస్పాండెంట్ మితిమీరిన ఖర్చులు, వ్యక్తిగత అలవాట్లే దీనికి కారణమన్న వ్యాఖ్యలు వినవస్తున్నాయి.




మూసేసిన శైలాస్ చిల్డ్రన్స్ అకాడమీ.

# నెల్లూరు సెంట్రల్ జైలులో సెల్‌ఫోన్ల వాడకం!

## దొరికితే దొంగలు లేకుంటే దొరలు

నెల్లూరు సెంట్రల్ జైల్లోని కొందరు ఖైదీలు సెల్‌ఫోన్లు వినియోగించడంపై జైళ్లశాఖ డిఐజి జయవర్ధన్ విచారణ చేపట్టారు. సెల్‌ఫోన్ల వాడకం బయటకు పొక్కడంతో జైలు అధికారుల్లో ఆందోళన మొదలైంది. ఇప్పటివరకు ప్రశాంతంగా వున్న జిల్లా జైలు ప్రస్తుతం వివాదాలకు నిలయంగా మారింది. నగరంలోని కేంద్ర కారాగారంలో శిక్ష అనుభవిస్తున్న ఖైదీలను చెముడుగుంట సమీపంలో నిర్మించిన ఓపెన్ ఎయిర్‌జైల్లో పనులు చేసేందుకు ప్రతిరోజూ తీసుకెళుతుంటారు. ఈ క్రమంలో ఎక్కువ సమయం జైలు బయట గడుపుతుండడంతో కొందరు ఖైదీలు సెల్‌ఫోన్లను వినియోగించే స్థాయికి ఎదిగారు. ఇందులో జైలు సిబ్బంది సహకారం కూడా వుందన్న ఆరోపణలు వినవస్తున్నాయి. కడప డిఐజి జయవర్ధన్ ఈ నెల 10వ తేది నగరానికి వచ్చి జైల్లో విచారణ ప్రారంభించారు. జైలు అధికారులు తమ ప్రమేయం ఏం లేదని నిరూపించుకొనేందుకు ఓపెన్ ఎయిర్‌జైల్లో పనులు చేస్తున్న కూలీల సెల్‌ఫోన్లు మరిచిపోయి వుంటారని, వాటిని ఖైదీలు కాకతాళీయంగా తీసుకొని వుంటారని విచారణ సమయంలో వెల్లడించినట్లు తెలిసింది. సెల్‌ఫోన్లు అవుట్ గోయింగ్, ఇన్‌కమింగ్ కాల్ డేటాను పరిశీలిస్తే వాస్తవాలు బహిర్గతమయ్యే అవకాశం వుంది.



జైలర్ రవికిరణ్‌ను ప్రశ్నిస్తున్న డిఐజి జయవర్ధన్.

# మహిళల సమస్యలపై స్పందనేది?

## తూతూమంత్రంగా మహిళా దినోత్సవం

ఈనెల 8వ తేది అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా నగరంలోని కస్తూర్భాకళాక్షేత్రంలో స్త్రీ, శిశు సంక్షేమశాఖ పెద్దసభ ఏర్పాటు చేసింది. ఈ సభకు వివిధ ఐసిడిఎస్ ప్రాజెక్టుల నుంచి అంగన్‌వాడి వర్కర్లు భారీ సంఖ్యలో తీసుకు వచ్చారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం కార్యక్రమం గురించి తెలియని కొందరు శాఖపరమైన సమావేశం వుంటుందని భావించి ఉదయం 9గంటలకే ఈ ప్రాంగణానికి చేరుకొన్నారు. కార్యక్రమం ప్రారంభించేనాటికి కళాక్షేత్రం నిండిపోయింది. తీరా ఒకరికొకరు ఆరా తీసుకొని శాఖాపరమైన సమావేశం కాదని తెలుసుకొని ఇంటిముఖం పట్టారు. ఐసిడిఎస్ సూపర్‌వైజర్ల అంగన్‌వాడి వర్కర్లకు తప్పుదారి పట్టించడంతో వారిని తిట్టుకుంటూ వెళ్లిపోవడం కనిపించింది. వాస్తవంగా అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ఏర్పాటుచేసే కార్యక్రమానికి నగరంలోని వివిధ శాఖల్లో పని చేస్తున్న మహిళలను ఆహ్వానిస్తే బాగుండేది. ఇదే రోజు ఎన్జీఓ మహిళా విభాగం ఆధ్వర్యంలో ఎన్జీఓ హోంలో క్రీడల్లో గెలుపొందిన మహిళలకు బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమాన్ని కూడా ఏర్పాటు చేయడం జరిగింది. మరొకప్రక్క మహిళా ప్రాంగణంలో ఒకే సమయంలో కార్యక్రమం నిర్వహించారు. ఈ మూడు కార్యక్రమాల్లో, స్త్రీ, శిశు సంక్షేమశాఖ పీడి పాల్గొనాల్సి రావడంతో ఆ రెండు కార్యక్రమాలకు గైర్హాజరై ఎన్జీఓ హోంలో జరిగిన కార్యక్రమానికి హాజరైనారు. కళాక్షేత్రంలో నిర్వహించిన సభకు నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, నెల్లూరు ఆర్డీఓ మాధవీలత హాజరయ్యారు. ముఖ్యఅతిథులుగా హాజరైన వీరు అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఎందుకు ఏర్పడింది. దీని ఉద్దేశం ఏమిటన్న విషయమై వివరించలేకపోయారు. ప్రధానంగా మహిళలు ఎదుర్కొంటున్న వివిధ రకాల సమస్యలు ప్రస్తావించి పరిష్కార మార్గం చూపలేక పోయారు. రాజకీయ వేదికల్లో ఏవిధంగా ప్రసంగిస్తారో అదేరీతిలో ఈ కార్యక్రమంలో మాట్లాడారు. ప్రభుత్వ కార్యక్రమం కావడంతో ఐసిడిఎస్ సూపర్‌వైజర్లు, అంగన్‌వాడి వర్కర్లు హాజరు కావాలని ఆదేశించడంతో కేంద్రాలను మూతవేసి నగరానికి తరలివచ్చారు. అంతేకాకుండా ఎన్జీఓ మహిళా విభాగం ఆధ్వర్యంలో ఏసి స్టేడియంలో మూడురోజులపాటు జరిగిన క్రీడా పోటీల సందర్భంగా ఉద్యోగులు విధులను దుమ్మా కొట్టారు.



మహిళలకు బహుమతులు అందిస్తున్న జెసి లక్ష్మీకాంతం.

# పౌర సేవ చేయకుంటే జరిమానా!

**కొత్త బిల్లు ఆమోదించిన కేంద్ర ప్రభుత్వం**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు పౌరులకు సేవలు అందించడంలో నిర్లక్ష్యం వహిస్తే జరిమానా చెల్లించాల్సి వుంటుంది. ఈ మేరకు ఇటీవల కేంద్రప్రభుత్వం పౌరసేవల పరిష్కార బిల్లు 2011కు సవరణలు చేసింది. సవరణలు చేసిన బిల్లును కేంద్రమంత్రి వర్గం ఏకగ్రీవంగా ఆమోదించింది. సవరించిన బిల్లు ఏప్రెల్ 1నుండి అమల్లోకి రానుంది ప్రభుత్వ ఉద్యోగి, అధికారి పౌరులకు నిర్దేశించిన సేవలు అందించకుంటే 250 రూపాయల నుంచి 50 వేల వరకు జరిమానా విధించే అవకాశం వుంది. ఇప్పటివరకు కొందరు ఉద్యోగులు, అధికారులు పౌరసేవల పట్ల చిన్నచూపు చూసేవారు. ఈ బిల్లు అమల్లోకి వస్తే ఇటువంటి అధికారులు విధి నిర్వహణలో జాగ్రత్తగా వ్యవహరించక తప్పదు. కేంద్రం తీసుకొచ్చిన ఈ చట్టంపై ముందుగా అన్ని ప్రభుత్వ శాఖలకు అవగాహన కల్పించాల్సిన అవసరం వుంది. అలాగే ప్రజల్లో కూడా దీనిపై ప్రచారం నిర్వహిస్తే పౌరసేవలు ఏ విధంగా పొందాలన్న దానిగురించి తెలుసుకొనే వీలుంటుంది. అలాకాకుండా ఈ చట్టాన్ని కేవలం కాగితాలకే పరిమితం చేస్తే ఆశించిన ఫలితాలు రాకుండాపోతాయి.

## సర్కారును కూలదోసేదెట్లా?

మొదటి పేజీ కొరవ

తీర్మానాన్ని తాను బలపరిస్తే, కెసిఆర్ స్థాయి పెంచిన వాడినౌతాననే భయం పట్టుకొన్నది చంద్రబాబుకు. అందువల్లనే ఈ అవిశ్వాసానికి తమ పార్టీ మద్దతు ఇవ్వబోవడం లేదని నిక్కచ్చిగా ప్రకటించాడు. అది తెలుగుదేశంలోనే కలకలం రేపింది. కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజావ్యతిరేకమైనదని ఒక పక్క మూడువేల కిలోమీటర్లు నడిచి మరీ నిరసిస్తున్న తమ పార్టీ అధినేత, అదే ప్రభుత్వాన్ని పడగొట్టే అవకాశాన్ని వదులుకోవడం ప్రజలలో ఎటువంటి సంకేతాలిస్తుందో అని చర్చించుకొంటున్నారు తెలుగు తమ్ముళ్లు. చంద్రబాబు అటువంటి తప్పు ఎప్పుడు చేస్తాడా అని ఎదురు చూస్తుండిన జగన్ రెచ్చిపోతున్నాడు. కాంగ్రెస్, టిడిపి కుమ్మక్కు పార్టీలనే అభిప్రాయాన్ని ప్రజలలో ప్రచారం చేయడానికి దీన్నొక సాధనంగా వాడుకొంటున్నాడు జగన్. రేపటి ఎన్నికలలో తనకు నిజమైన ప్రత్యర్థి తెలుగుదేశమే తప్ప కాంగ్రెస్ కాదన్న నిజం జగన్‌కు బాగా తెలుసు. తెలుగుదేశం, కాంగ్రెస్ వేరు వేరు కాదు, అవి రెండూ ఒకే తానులో కోకలని ప్రజలలో ప్రచారం చేసుకోవడానికి ఇదొక అవకాశం ఆయనకు.

అయితే జగన్‌కు రేపటి ఎన్నికలకంటే ఇప్పటి అవిశ్వాసం మీదనే ఆసక్తి జాస్తిగా వుంది. అవసరం కూడా అట్లనే వుంది. కిరణ్ సర్కారు మరొక ఏడాది పాటు పదవిలో కొనసాగితే తనకు, తన పార్టీకి చాలా ఇబ్బందులొస్తాయన్నది జగన్ భయం. మొదటి భయం – మునిసిపల్, పంచాయితీ ఎన్నికలు జరిపిస్తారన్నది. ఆ ఎన్నికలకు జగన్ ఏ మాత్రం సిద్ధంగా లేదు. ఆయన చాలా కాలం నుంచి జైలులో వుండడం వల్ల పార్టీ అస్తవ్యస్థంగా తయారౌతున్నది. జిల్లాలలో ముఠా కుమ్ములాటలు పెరిగిపోయాయి. పార్టీకి జనంలో ఆదరణ వుందే తప్ప దాన్ని వ్యవస్థీకృతం చేసే కార్యకర్తల యంత్రాంగం ఏర్పడలేదు. ఈ దశలో స్థానిక సంస్థల ఎన్నికలొస్తే పార్టీ చాలా పెద్ద సవాళ్లను ఎదుర్కోవలసి వస్తుంది. ఈ ఎన్నికలలో గెలిచినా జగన్‌కు వచ్చే లాభం ఏదీ లేదు. ఆయనకు కావలసింది ముఖ్యమంత్రి పదవి. అది వీటితో రాదు. పైగా ఒకసారి తన పార్టీకి ఓటు వేసిన జనం ఆ వెంటనే వచ్చే అసలు ఎన్నికలలో మోజు తీరి పోయిందనుకొంటే అసలుకే మోసం. అందువల్ల స్థానిక సంస్థల ఎన్నికల చీకాకును తప్పించుకోవాలి. అందుకు ఒకే ఒక మార్గం కిరణ్ సర్కారును కూలగొట్టడం. అందుకు అవసరమైతే చంద్రబాబుతో శాసనసభ లోపల కలిసి పని చేయడానికి కూడా సిద్ధపడుతున్నాడాయన.

అయితే తన గద్దె క్రిందకు నీళ్లు తెస్తున్న ఈ ప్రమాదాన్ని తప్పించుకొనే ప్రయత్నాన్ని కిరణ్ కుమార్‌రెడ్డి చూస్తూ వూరుకొంటాడని భావించడం పొరపాటు. ఆయనంత అమాయకుడేమీ కాదు. పైగా అసాధ్యుడు కూడా. తుమ్మితే వూడే ముక్కు అన్పించుకొంటూనే రెండున్నరేళ్లు ముఖ్యమంత్రిత్వం నెరపాడు. మరొక ఏడాది కూడా కొనసాగాలని కోరిక. కొమ్ములు తిరిగిన ధీరులనుకొన్న నేదురుమల్లి జనార్ధనరెడ్డి, కోట్ల విజయభాస్కర్‌రెడ్డి, మర్రి చెన్నారెడ్డి వంటివారు కూడా మూడేళ్లపాటు వరసగా ముఖ్యమంత్రిత్వం నిర్వహించలేదు. దాన్నిబట్టే కిరణ్‌కుమార్‌రెడ్డి ఎంత తెలివైనవాడో అర్థం చేసుకోవచ్చు.

అవిశ్వాసం పట్ల చంద్రబాబు మనసు మారనంత వరకు కిరణ్‌కు వచ్చిన పేచీ ఏదీ లేదు. అయితే అటు జగన్, ఇటు కెసిఆర్ కూడా చంద్రబాబు మీద గట్టి ఒత్తిడి తెస్తున్నారు. కెసిఆర్‌కు చేత వచ్చిన విద్య – నోటికొచ్చినట్లు తిట్టడం. ఇప్పుడూ పనే చేస్తున్నాడు. జగన్ పార్టీ మాత్రం వ్యూహాత్మకంగా చంద్రబాబును ఇరుకున పెట్టడానికి తన పత్రిక, టీవీ ఛానళ్లను వాడుతున్నది. కాంగ్రెస్‌తో కుమ్మక్కయ్యారనే ప్రచారంతో తెలుగుదేశం కార్యకర్తలు, నేతల నుంచి చంద్రబాబు మీద ఒత్తిడి తేవాలన్నది జగన్ వ్యూహం.

మొత్తం మీద రాబోయే రెండుమూడు వారాల పాటు అవిశ్వాసం నాటకం జనానికి మంచి కాలక్షేపమే కల్గించబోతున్నది. అయితే అవిశ్వాసం ఎప్పుడు చర్చకు వస్తుందన్న విషయంలో మాత్రం స్పష్టత లేదు. టిఆర్ఎస్ పక్షాన తీర్మానం ప్రతిపాదన అందిన తర్వాత, నిర్ణయం తీసుకొనేందుకు స్పీకర్‌కు స్వేచ్ఛ వుంటుంది. ఇప్పుడు బడ్జెట్ సమావేశాలు జరుగుతున్నాయి కాబట్టి, కనీసం ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్ ఆమోదం పొందేవరకు ఈ తీర్మానం చర్చకు రాకపోవచ్చు. అప్పుడు కూడా ఇదే సమావేశాలలో చర్చ పెట్టవచ్చు. లేదంటే కొత్తగా ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేస్తానని కూడా స్పీకర్ ప్రకటించవచ్చు. అందువల్ల కనీసం ఏప్రెల్ నెల మొదటి వారం వరకు అవిశ్వాసం చర్చకు రాదు. ఆ లోగా కిరణ్ కుమార్‌రెడ్డి కాంగ్రెస్ ఎమ్మెల్యేలను ఏ రీతిలో మచ్చిక చేసుకొంటాడో, చంద్రబాబు తన మొండి పట్టుదల మీద ఎంతవరకు నిలబడగలుగుతాడో వేచి చూడాలి.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### సింహపురి హోటల్‌లో అన్నదానం!

నెల్లూరు రైల్వేఫీడర్స్ రోడ్డులోని హోటల్ సింహపురి వ్యవస్థాపకుడు సన్నపరెడ్డి వెంకటరెడ్డి తొమ్మిదవ వర్ధంతిని హోటల్ ప్రాంగణంలో నిర్వహించారు. ఈ సందర్భంగా వెంకటరెడ్డి కుమారుడు శ్రీధర్‌రెడ్డి ప్రత్యేక పూజా కార్యక్రమం అనంతరం 500 మంది పేదలకు అన్నదానం చేశారు.

### పార్కు స్థలం ఆక్రమణకు యత్నం

నెల్లూరు బొల్లినేని హాస్పిటల్ ఎదురుగా క్రాంతినగర్‌లోని పార్కు స్థలాన్ని కార్పొరేషన్ అధికారుల అండతో కొందరు భూబకాసురులు 11వ తేది ఆక్రమించే యత్నం చేశారు. ఎంతో విలువైన ఈ స్థలం చుట్టూ కార్పొరేషన్ పది లక్షల రూపాయలు వెచ్చించి ప్రహరీగోడ నిర్మించి, గ్రావెల్, మట్టి తోలించి లెవలింగ్ చేయించారు. డ్రైనేజ్ కట్టి, ఇనుప గేటు పెట్టి ఇప్పుడీ స్థలంలో సగం స్థలాన్ని వేరుచేస్తూ గోడ కట్టే యత్నం చేశారు. స్థానికుల ద్వారా విషయం తెలుసుకొన్న వైకాపా నేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి బృందం ఈ ప్రాంతానికి చేరుకొని ధర్నాకు దిగడంతో కబ్జారాయుళ్లు పరారయ్యారు. ఈ ప్రాంతంలో ఇదివరకు సైతం మరో పార్కు స్థలం కబ్జా జరిగిన ప్రయత్నాన్ని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి బృందమే నిలువరించింది.

### ముదిరాజ్ మాస పత్రిక ఆవిష్కరణ!

ముదిరాజ్ మాస పత్రికను నెల్లూరు ఇందిరా భవన్‌లో నెల్లూరు జిల్లా ముదిరాజ్ మహాసభ జిల్లా అధ్యక్షుడు కనకట్ల రఘురామ్ ముదిరాజ్ ఆవిష్కరించారు. రాష్ట్రంలో వున్న ముదిరాజ్‌ల స్థితిగతులను తెలియజేయడానికి, వారిని చైతన్య పర్చడానికి ఈ పత్రికను తమ నాయకుడు కాసాని జ్ఞానేశ్వర్ స్థాపించినట్లు రఘురామ్ ముదిరాజ్ చెప్పారు. ముదిరాజ్ కులస్తులను చైతన్యవంతం చేయను జూలై నెలలో తడ నుంచి శ్రీకాకుళం వరకు కాసాని జ్ఞానేశ్వర్ పాదయాత్ర చేపడతారని రఘు వివరించారు.

### గూడూరు గౌస్‌బాషాకు ఉగాది పురస్కారం!

గూడూరులో 50ఏళ్ల క్రితం కాళిదాసు కళానికేతన్ స్థాపించి ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం మొదలు ఎందరో గాయకులు, కళాకారుల్లోని ప్రతిభను వెలికి తీసిన గౌస్ బాషకు ఢిల్లీలోని తెలుగు కళా సంఘం ఉగాది పురస్కారాన్ని ప్రకటించింది. 5వ తేది ఢిల్లీలోని ఎపిభవన్‌లోని డాక్టర్ అంబేద్కర్ ఆడిటోరియంలో ఈ అవార్డును గౌస్ బాషకు అందిస్తారు. గౌస్‌బాష కళాసేవకు ఎన్నో అవార్డులివ్వవచ్చు. ఢిల్లీలోని తెలుగు కళా సంఘం గుర్తించి ఇస్తున్నందుకు అందరూ ఆ సంస్థను అభినందించాలి.

### సృజన కవితా పోటీల్లో విజేతలు

అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరులోని సృజన సాహిత్య సాంస్కృతిక వేదిక రాష్ట్రస్థాయిలో కవితల పోటీలు నిర్వహించింది. పోటీల్లో విజేతలుగా దేవరాయపల్లె నాగజ్యోతి, పురిమళ్ల సునంద, యక్కంటి పద్మావతి, వరుస మూడు స్థానాలు పొందారు. ములుగు లక్ష్మీ మైథిలి, ధూర్జటి సరస్వతీదేవిలు ప్రోత్సాహక బహుమతులు పొందారు. విజేతలకు 9వ తేది టౌన్‌హాలులో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో సిడిపిఓ ప్రభావతమ్మ, స్మార్ట్ క్లినిక్ అధినేత మారం సుధాకర్, నిర్వాహకుడు దగ్గుపాటి రాధాకృష్ణ బహుమతులందించారు.

### శంభో శివం శంకరం

నగరానికి చెందిన ప్రముఖ సంగీత విద్వాంసురాలు బాలార్క ఆధ్వర్యంలో మహాశివరాత్రిని పురస్కరించుకొని శంభో శివం శంకరం పేరుతో శివగానామృత కార్యక్రమం టౌన్‌హాల్లో జరిగింది. ఆమె శిష్యులు పలువురు పాల్గొని శివపంచాక్షరి ఇతర పాటలను ఆలపించారు.

### న్యూఢిల్లీ సదస్సుకు డాక్టర్ జగదీష్

నెల్లూరీయుడు ప్రత్యామ్నాయ ఇంధన వనరుల నిపుణుడు డాక్టర్ జగదీష్‌కు న్యూఢిల్లీలోని జవహర్‌లాల్‌నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఈ నెల 22వ తేది నుంచి 24వ తేది వరకు జరిగే సదస్సు 'కమ్యూనికేటింగ్ సైన్స్ ఆఫ్ కన్సర్వేషన్ ఆఫ్ ది ప్లానెట్ ఎర్త్ టుది వేపుల్ పర్ పీస్‌ఫుల్ కో ఎక్సిస్టెన్స్ అండ్ ఎజస్ట్ వరల్డ్‌లో పాల్గొనమని ఆహ్వానమందింది.

### నూనె మల్లికార్జునకు మాతృ వియోగం!

తెలుగుదేశం పార్టీలో మిలిటెంట్‌లాంటి బిసి నాయకుడు నూనె మల్లికార్జున యాదవ్ మాతృమూర్తి నూనె రమణమ్మ 6వ తేది మూలపేట కొండదిబ్బలోని ఆమె నివాసంలో మరణించారు. ఆమెకు మల్లికార్జున కాక మరో ముగ్గురు కుమార్తెలున్నారు. వీరి కుటుంబానికి మా సానుభూతి.

## మొదటి జాబితా భేష్

16వ పేజీ కొరవ

అవి ముందుకు వస్తాయి. అప్పుడు పరిస్థితి ఇంత సుకరంగా వుండదన్నది నిజం. కొన్ని నియోజకవర్గాలలో సమస్థాయి కల్గిన నేతలు టిక్కెట్ కోసం ఎదురు చూస్తున్నారు. పోటీలు పడి మరీ లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టుకొంటున్నారు. షర్మిల కార్యక్రమమైనా, జగన్ ఓదార్పు అయినా, వైఎస్ విగ్రహాలైనా, ఇతరత్రా కార్యక్రమాలైనా వీరి జేబు చిలుము బాగానే వదలుతున్నది. టిక్కెట్ రాదని ఈ సమయంలోనే వారికి తేల్చి చెప్తే ఎన్నికల లోపల పార్టీకి ఎంత నష్టం చేయాలో అంతా చేస్తారు. అందు వల్ల అటువంటి కీలక స్థానాలను జాగ్రత్తగా గుర్తించి, జగన్ జైలు నుంచి విడుదలై వచ్చే వరకు వాయిదా వేయాలని ఆలోచిస్తున్నారు వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలు.

## జనవాణి

2వ పేజీ కొరవ

వచ్చాయి. జరగాల్సింది జరిగిన తర్వాత ఉత్తుత్తి బాంబులు పెట్టడం, బాంబు వున్నట్లు సమాచారం అందడంతో వాహనాల తనిఖీని ఉధృతం చేస్తూ పోలీసులు హడావుడి చేస్తుంటారు. ఈ హడావుడి కేంద్రం హెచ్చరికలు చేసినప్పుడు చేస్తే బాగుండేది కదా అని జనాభిప్రాయం.

కె.వెంకటేశ్వర్లు కావలి

### దైవత్వం లేని బాబా!

వార్తాపత్రికలో ఒక వార్త చదివి ఆశ్చర్యం పొందాను. కొంత జాలి కలిగింది; కోపమూ వచ్చింది. ఆధ్యాత్మిక బోధనలు చేసే చండీఘడ్‌కు చెందిన బాబా 55లక్షల రూపాయలు వెచ్చించి కొన్న 'ఆడి' కారుకు ఎఆర్0001 నంబరును రోడ్డు ట్రాన్స్‌పోర్టు అథారిటీ వద్ద పొందేందుకు 10 లక్షల రూపాయలు చెల్లించారు. ఆయన బాబాగా పూజనీయుడే కాదు. ఆయన్ను దైవంగా పూజించే మనుష్యులను చూస్తే జాలి కలిగింది. ఆయన్ను ఏ మాత్రం దండించలేని ప్రభుత్వాన్ని చూస్తే కోపమొస్తుంది. జుట్టు పీక్కోవాల్సిందే. ఇంతకంటే ఏమి చేయగలం.

తూపిలి వనమాలి నెల్లూరు

### మంచితీర్పు!

హైకోర్టు ఆదేశించిందని నెల్లూరు కార్పొరేషన్ నగరంలో కుక్కలు పట్టడం లేదు. దీనివల్ల కుక్కలు విపరీతంగా పెరిగిపోయి జనాన్ని ఇబ్బంది పెడుతున్నాయి. ఇటీవల చెన్నైలోని కెన్నెల్ క్లబ్ తమ వద్ద వున్న కుక్కల తోకలు కత్తిరించేసింది. ఈ విషయమై నెల్లూరులో మాదిరిగానే జంతు పరిరక్షణ సమితి ఆగ్రహం వ్యక్తం చేస్తూ కోర్టును ఆశ్రయించింది. దీనిపై న్యాయమూర్తి ఇరుపక్షాల వాదనలు విని కత్తిరింపులకు అనుమతించేశారు. కుక్కల బాగోగులపై యజమానులకు పూర్తి హక్కు వుంటుందని తేల్చి చెప్పేశారు. నెల్లూరు కార్పొరేషన్ ఈ తీర్పు ప్రతిని సంపాదించి హైకోర్టులో దాఖలు చేసి నగరంలో శునకాలు పట్టే పని చేపట్టాలని వినతి.

పి.అరుణకుమారి నెల్లూరు

## పదరంగం -59

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | 3 | | 4 | | 5 |
| | | | 6 | | | | | | |
| 7 | 8 | | | | 9 | 10 | | 11 | |
| | 12 | 13 | | 14 | | | | 15 | 16 |
| 17 | | | | 18 | | | | | |
| 19 | | | 20 | | | | | 21 | |
| | | 22 | | | | 23 | 24 | | |
| | 25 | | | | 26 | | | | 27 |
| 28 | | 29 | | 30 | | 31 | | | |
| 32 | | | | | | 33 | | | |

**అడ్డం**

1. చెమట (4)
3. సభాస్థలం (3)
6. దుష్టుడు, దుర్మార్గుడు (3)
7. అటునుంచే అపకారం (2)
9. అతివ, స్త్రీ, ఈమె కంట కన్నీరొలకకూడదు (4)
12. తెలుగు కోల్డ్, అందర్ని వణికించేది (2)
15. పరాయి కాదు, స్వంత (2)
17. అటునుంచి పత్రములు (3)
18. మంచి లక్షణం (3)
19. రజ్జువు, బొంగరాన్ని త్రిప్పేది (2)
20. నామధేయం (2)
21. సూర్యుడు (2)
22. కొయ్య తినే పురుగులు (3)
23. బూజర, బూజర (3)
25. ఒక్కమాటలో సిరి, నిలువు 5తో కలిస్తే ఒక పాత సినీ నటి (1)
26. ఎడబాటులో (5)
29. తుండుగుడ్డ, పైగుడ్డ (3)
31. కనకంలో కం లేదు (2)
32. అటునుంచి వాత, చీవాట్లు (3)
33. అటునుంచే సర్పాలు (3)

**నిలువు**

1. ఘనమైన వాడు (3)
2. పస్తు, పరమౌషధం (3)
3. సంబరం పండగ (3)
4. కంటి మందు (3)
5. స్వరం.... నారాణి అన్నాడు తెనాలి రామలింగడు (2)
8. సైరంధ్రిని కామించిన వాడు (4)
10. గుణం (3)
11. క్రింద నుంచి వంటింటి వైద్య దినుసు (2)
13. క్రింద నుంచి భార్య ఒక హాస్య నటుడు (2)
14. సురులు కాదు, రాక్షసులు (4)
16. కోరిక, తమన్నా (3)
17. పట్టింపులకు ముందుమాట, పట్టుదలలో క్రింద నుంచి (3)
20. ధనికుడు కాదు (4)
21. ఒక విధము (3)
23. డాగులు, మచ్చలు (4)
24. ఓర్పు (4)
27. ప్రపంచం, లోకాలలో ఒకటి (2)
28. మేషం (2)
29. ఒక లోహం, ఇది మ్రోగి నట్లు కనకం మ్రోగదు (2)
30. వర్షం (2)

### సమాధానాలు

## పదరంగం -58

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]స | ర | [2]శ్రీ | [3]స్వ | రా | [4]లు | | [5]ప | రా | [6]గం |
| హ | | [7]పా | రూ | | [8]గ | [9]వా | క్షం | | ద |
| [10]జీ | [11]వి | | [12]పం | [13]చ | వ | టి | | | ర |
| [14]వ | రా | లు | | కో | | క | | [15]డ | గో |
| [16]నం | గి | | [17]ఆ | రం | [18]భం | | [19]మం | గ | ళం |
| | [20]ని | [21]రా | శ | | [22]గు | రి | | ర | |
| [23]ల | | స | | [24]గో | | | [25]ఒ | | |
| [26]గా | వు | కే | [27]క | | [28]పు | [29]ల | క | [30]ర | [31]ము |
| య | | [32]శ్రీ | కే | | | వ | | [33]భ | స |
| [34]తు | ల | | | [35]క్లా | | [36]ము | దు | స | లి |

# ఎండిన ఎముకల గుడికి
# మానవతా హారతి!

ఈ సృష్టిలో అంధకారం అనాదిగా వుంది. అలాగే వెలుగూ వుంది. కానీ అనాథగా ఉండి పరిస్థితులను ఎదిరించి 'అనాథను' "నాథునిగా" మలచే సాహిత్య ప్రక్రియలు ఎన్నైనా నేటి యుగావసరం. ఈ క్రమంలో అభ్యుదయ కవిత్వం, విప్లవ రచనలు మన ముందుకొచ్చాయి. వేమన, రాజారామ్ మోహన్ రాయ్, గురజాడ, వీరేశలింగం పంతులు, నెహ్రూ, శ్రీశ్రీ, జాషువా, కొడవటిగంటి కుటుంబరావు, చెరబండ రాజు, పుచ్చలపల్లి సుందరయ్య, కె.వి.ఆర్, శివసాగర్, పాపినేని శివశంకర్, పాశ్చాత్యులలో సోక్రటీసు, కారల్ మార్క్సు, డార్విన్, బెట్రాండ్ రస్సెల్, బ్రాడ్లా మొదలగు ఎందరో...

ఇదే కోవలో శారదాకుమార్(శివరాజు వేంకట నరసింహారావు)గారు 40 సంవత్సరాల క్రితమే నిరంతరం చిరంతనశీలినై 'పవి'నై దుర్మార్గపు లోకాన్ని 'నాకం' చేస్తానని, కవిగా "సామ్యగానం" చేసి మహాకవి శ్రీశ్రీ కళ్లలో నీరు చిందించాడు. మహాకవి దాశరథిచే "శభాష్" అనిపించుకున్నాడు. వానమామలై వరదాచార్యులు లాంటి దిగ్గజ కవులచే "వెలుగు లీనురత్నం" అని ప్రశంశలందుకున్న కవి శారదాకుమార్ గారు. 2012 సంవత్సరంలో ద్వితీయ ముద్రణ సందర్భంగా మరలా ఆయన "సామ్యగానం" ఒకసారి విందాం రండి!!

*నేటి "భూబకాసురుల"ను గూర్చి గానం చేస్తూ...*

"అరంగుళం ఎదుగకుండ
అనంతాన్ని కబళిస్తూ
ఆకాశానికడుగెత్తు
సరికొత్త వామనులు"

*శ్రమజీవులు - పెట్టుబడిదారులు స్వభావం గానం చేస్తూ...*

"శ్రమ" చేసే పకోడీలు
"తీరుబడి" తింటున్న కొరుకుతూ

**పుస్తకసమీక్ష**

**సామ్యగానం – హారతి మానవతా!**
(కవితా సంపుటి)
రచయిత : **శారదా కుమార్**
సమీక్షకుడు : **రాచపాళెం రఘు**
వెల : **45/-** పేజీలు : **84**
**ప్రతులకు : యస్.వి.నరసింహారావు**
(శారదాకుమార్) బి.ఎ., బి.టి.,
హెచ్.నెం.24/589, రాజాగారి ప్లాట్స్
మూలాపేట, నెల్లూరు–524 003
ఫోన్ : 0861–2337624

*స్వార్థపర జీవులను గూర్చి గానం చేస్తూ...*

"స్వార్థమే సర్వస్వమనుకునే
గార్ధభాలకు హారతులెందుకు?
అడ్డదారిన వారు కరచిన గడ్డే చాలు"

*పాలకుల నికృష్ట శాసనాలు ప్రజలకు ఎలాంటి ఫలాలనిస్తున్నాయో వినండి*

"ఒక బ్రతుకు చాకిరికి
చావే ఫలమని
నికృష్టంగా నిర్దేశించే
క్రొత్త శాసనం చేసిందెవరు?"

*ఈలాంటి నికృష్ట పరిస్థితులలో శ్రమజీవుల కర్తవ్యం ఏమిటో వినండి!*

"సంకెళ్లను తెగదెంచుకొని
నవభువనం రహించేందుకు
ఈ దమనం దమించేందుకు
ఆ మరణం క్రమించేందుకు
విలయానికి విరుగబడి,
తరలండి! తెమలండి!
లేలెండి! కదలండి!!

*"సామ్యవాదపు కవిగా"గా తన కర్తవ్యం ఏమిటో వినండి!!*

"సమజీవన నౌకకు నేనే కెప్తాను
పాత బ్రహ్మ వ్రాతలన్నీ
తిరుగ వ్రాసితీరుతాను
మీ నొసటను వ్రాసినట్టి
పిచ్చి వ్రాత తుడుపుతాను
ఊరుకోను, తేరుకోను!
సామ్యానందపు గమ్యం
సామాన్యుడు చేరుదాక!!
ప్రగతి రథం ఆపజూచు
రాలుగాయి వెధవాయిలు" వున్నప్పటికీ...

ఎండిన ఎముకల గుడికి "మానవతా హారతి"ని వెలిగిస్తూనే ఉంటానన్న శారదా కుమార్‌ను మనమందరం మనసారా అభినందించాలి. ఈలాంటి కవి నెల్లూరీయుడైనందుకు గర్వపడాలి!



రైతు లోకం

## వరిలో చీడపీడలు – నివారణ!

ప్రస్తుతం వరిపంట మన జిల్లాలో దుబ్బు చేసే దశ నుంచి కంకి బయటకు వచ్చే దశ వరకు ఎక్కువ భాగం వున్నది. ప్రస్తుత వాతావరణ పరిస్థితులలో దోమపోటు మరియు అగ్గి తెగులు అక్కడక్కడా ఆశించి వున్నాయి.

**సుడిదోమ (దోమపోటు):** ఈ దోమ వరి మొక్కల మొదళ్ల దగ్గర గుంపులుగా చేరి రసం పీల్చుట వల్ల పైరు లేత పసుపు రంగులోకి మార్పుచెంది క్రమంగా సుడులు, సుడులుగా ఎండిపోతుంది.

**నివారణా చర్యలు:** అప్పుడప్పుడు పొలాన్ని ఆరబెట్టి మరలా పలుచగా నీరు పెట్టాలి. ఆఖరి దఫా వేసే నత్రజని ఎరువును సిఫార్సు మేరకే వేయాలి. ఆఖరి దఫా నత్రజనితోపాటు పొటాష్ ఎరువును తప్పనిసరిగా వేయాలి. దోమ ఆశించినప్పుడు థయోమిథాక్సామ్ 0.3 గ్రాములు లేదా మోనోక్రోటోఫాస్ 2.2 మిల్లీలీటర్లు లేదా అసిఫేట్ 1.5 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి. దోమ ఉధృతంగా వున్నప్పుడు మోనోక్రోటోఫాస్ 2.2 మిల్లీలీటర్లు మరియు డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు లేదా అసిఫేట్ 1.5 గ్రాములు మరియు డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు లేదా బుప్రోపెజిన్ 1.5 మిల్లీలీటర్లు లేదా ఇతోఫెన్‌ప్రాక్స్ 1.5 మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి మొదళ్లు తడిచేటట్లు పిచికారీ చేసుకోవాలి. పవర్ స్ప్రేయర్‌తో, పెట్రోల్ పంపులతో పిచికారీ చేసేటప్పుడు ఎకరాకు 7–8 ట్యాంకుల మందునీరు సరిపోతుంది. కావున మందు మోతాదు లీటరు నీటికి 2 1/2 నుండి 3 రెట్లు పెంచుకోవాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

**అగ్గితెగులు:** ఈ తెగులు ఆకులపైన చిన్న లేత నీలిరంగు మచ్చలుగా ప్రారంభమై క్రమేమీనూలు కండె ఆకారపు మచ్చలుగా మారి, మచ్చ మధ్య భాగం వెడల్పుగా వుండి చివరలు సన్నగా వుంటాయి. ఈ మచ్చలు ఒక దానితో ఒకటి కలసిపోయి ఆకులు ఎండిపోతాయి. పైరంతా తగులబడినట్లుగా కన్పిస్తుంది.

తరువాత దశలో వెన్నులు తీసిన తరువాత మెడ భాగాన గోధుమ లేదా నలుపు రంగు మచ్చలేర్పడి గింజలు పాలు పోసుకునే సమయంలో మెడ భాగం విరిగి గింజలు తాలు పోతాయి. దీనినే మెడ విరుపుగా పిలుస్తారు.

**నివారణ చర్యలు:** నత్రజని ఎరువులను సిఫార్సు చేసిన మోతాదులో సరియైన పైరు దశలో వేయాలి. వెన్నులు బయటకు వచ్చే దశలో నత్రజని ఎరువులు వేయరాదు. నేల స్వభావాన్ని బట్టి పొటాష్ ఎరువును 30 కిలోలు ఒకటి లేదా రెండు దఫాలుగా వేయాలి. ఆకులపై తెగులు లక్షణాలు కనిపించిన వెంటనే ట్రైసైక్లజోన్ 0.6 గ్రాములు లేదా ఐసోప్రోథయోలేన్ 1.5 మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి. అవసరాన్ని బట్టి 10 రోజుల వ్యవధిలో మందు మార్చి మరలా పిచికారీ చేయాలి. మెడ విరుపు తెగులు నివారణకు కాసుగామైసిన్ 2.5మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి వెన్నులు తీసిన వెంటనే పిచికారీ చేయాలి. కంకి బయటకు వచ్చినప్పటి నుంచి పాలు పోసుకునే దశ వరకు సస్యరక్షణ మందులను ఉదయం 11 గంటల వరకు పిచికారీ చేయరాదు. 

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14
జమీన్‌రైతు

# తెలుగు తమ్ముళ్ల వలస!

తెలంగాణకు సానుకూల ప్రకటన చేసిన తర్వాత కూడా ఆ ప్రాంతంలో తెలుగుదేశం ఆశించినంత ప్రజాదరణ పొందలేక పోతున్నాదన్న అసంతృప్తి తెలుగు తమ్ముళ్లలో కన్పిస్తున్నది. ఆంధ్ర నేతలు ఎన్ని అభ్యంతరాలు పెట్టినా చంద్రబాబు తెలంగాణ సానుకూల ప్రకటన చేశాడు. దాని ద్వారా రేపటి ఎన్నికలలో టిఆర్‌ఎస్‌కు గట్టి పోటీ ఇవ్వవచ్చునని, తెలంగాణ నినాదం తమ పేటెంట్ హక్కు అన్న రీతిలో వ్యవహరిస్తున్న కెసిఆర్‌కు చెక్ పెట్టవచ్చునని ఆశించాడు చంద్రబాబు. అయితే ప్రజలు మాత్రం తెలుగుదేశం పార్టీని తమ మద్దతుదారుగా అంగీకరించడం లేదు. వారి మనసులలో తెలుగుదేశం కూడా తెలంగాణ కోసం పోరాడుతున్నదన్న భావన చొప్పించడంలో ఆ పార్టీ విఫలమౌతున్నది.

ఈ నిజాన్ని గ్రహించిన చాలామంది తెలుగుదేశం ఎమ్మెల్యేలు రేపటి ఎన్నికలలో తమ గెలుపు పట్ల అనుమానాలకు గురౌతున్నారు. జనం టిఆర్‌ఎస్‌ను కాదని తమకు ఓటు వేస్తారా లేదా అన్న అవగాహనకు రాలేక పోతున్నారు. దాన్ని ఫలితమే తెలుగుదేశం ఎమ్మెల్యేలు హైదరాబాద్ నగరానికి వలస వచ్చే ప్రయత్నం చేయడం. మహబూబ్‌నగర్ జిల్లా కొడంగల్ ఎమ్మెల్యే రేవంత్‌రెడ్డి వీరిలో ప్రథముడు. ఆయన రేపటి ఎన్నికలలో హైదరాబాద్ సిటీలో భాగమైన మల్కాజ్‌గిరి ఎమ్పీ స్థానానికి పోటీ చేయాలని ప్రయత్నిస్తున్నాడు. హైదరాబాద్ సిటీలో తెలంగాణ వాదం పెద్దగా లేదని, జగన్ పట్ల సానుభూతి కూడా చెప్పుకోదగిన రీతిలో లేదని ఒక అభిప్రాయం వుంది. పైపెచ్చు నగరం లోపల టిఆర్‌ఎస్‌కు స్థానబలం లేదు. వారి పార్టీ అత్యంత బలహీన స్థితిలో వుంది ఇక్కడ. అందువల్ల కొంచెం కష్టపడితే సిటీ పరిధిలో తెలుగుదేశానికే అధికమని నేతల భావన.

రేవంత్‌రెడ్డి తోపాటు, మైనంపల్లి హనుమంతరావు కూడా మల్కాజ్‌గిరి ఎమ్మెల్యే స్థానం పట్ల మోజు పడుతున్నాడు. అయితే ఇక్కడ తన కుటుంబ సభ్యులను నిలుపుకోవాలని దేవేంద్రగౌడ్ కోరిక. దానితో ఆయన హనుమంతరావుకు అడ్డుపుల్ల వేస్తున్నాడు. దానితో ఇద్దరి మధ్య మాటల యుద్ధం నడుస్తున్నది. వరంగల్ జిల్లా పాలకుర్తి ఎమ్మెల్యే, తెలుగుదేశం సీనియర్ నేత ఎర్రబల్లి దయాకరరావుకు కూడా సిటీకి వలస రావాలనే ఆలోచన వుందని చెప్తున్నారు. కూకట్‌పల్లి వెలమ ప్రవాసుల స్థావరం. అక్కడ నుంచి పోటీ చేస్తే గెలుపు సులభం అవుతుందని ఆలోచన చేస్తున్నాడట ఆయన. మొత్తానికి తెలంగాణ తెలుగు తమ్ముళ్లు వలస పక్షుల వలె మారి పోతున్నారు. వీరి అభిలాషను చంద్రబాబు ఎంతవరకు మన్నిస్తాడో వేచి చూడాలి.

## మోడి వైపు మొగ్గుకు ఒత్తిడి!



తెలుగుదేశం పార్టీ రేపటి ఎన్నికలలో బిజెపితో పొత్తు పెట్టుకొంటే బాగుంటుందని ఆ పార్టీలో అధిక భాగం కోరుకొంటున్నది. ప్రజలలో నరేంద్ర మోడి పట్ల వున్న ఆకర్షణను ఆధారం చేసుకొని జగన్ వ్యామోహాన్ని నిలువరించవచ్చునన్నది వారి అంచనా. తెలుగుదేశం సీనియర్ నాయకుడు ఇరగల పెద్దిరెడ్డి గోదావరి జిల్లా పర్యటనలో వున్న చంద్రబాబుతో ఈ అంశాన్ని నేరుగా ప్రస్తావించాడు. అయితే దానికి చంద్రబాబు నుంచి సానుకూలత వ్యక్తం కాలేదు. గతంలో ఒకసారి బిజెపితో పొత్తు పెట్టుకోవడం వల్ల మైనార్టీలు తెలుగుదేశానికి దూరమైపోయారని, మరొకసారి అటువంటి పొరపాటు చేయడం సముచితం కాదని చంద్రబాబు అభిప్రాయపడ్డాడు. అయితే ఆయన ఆలోచనతో తెలుగుదేశం నేతలు ఏకీభవించడం లేదు. రాష్ట్రంలో మైనార్టీలందరూ ఏక మొత్తంగా జగన్ వెంట నడుస్తున్నారని, తెలుగుదేశానికి ఓటు వేసేందుకు సిద్ధంగా లేరని, బిజెపితో పొత్తు పెట్టుకొన్నా, పెట్టుకోకపోయినా పెద్ద తేడా వుండదని, బిజెపితో కలిస్తే కనీసం హిందు ఓట్లైనా జగన్ నుంచి తమ వైపుకు వస్తాయని తెలుగు తమ్ముళ్లు వాదిస్తున్నారు. ఎన్నికలలోగా ఈ విషయమై సానుకూల నిర్ణయం తీసుకోవాలని చంద్రబాబు మీద ఒత్తిడి తెస్తున్నారు.

## మొదటి జాబితా భేష్!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ మొదటి విడతగా 90 అసెంబ్లీ స్థానాలకు నియోజకవర్గ ఇన్‌ఛార్జిలను ప్రకటించింది. ఈ ప్రకటన చేసే సమయంలో చాలా ఆందోళనకు గురైనారు. ఇంత ముందుగా ఇన్‌ఛార్జిలను ప్రకటిస్తే టిక్కెట్ మీద ఆశ వున్నవారు పార్టీకి దూరమైపోతారని, ఆ పదవి ఆశించి భంగపడిన వారు పార్టీకి నష్టం కల్గిస్తారని భయపడ్డారు. అయితే జాబితా ప్రకటన తర్వాత జరిపిన సర్వేలో అటువంటి భయాలు అవసరం లేదని తేలిందట. నియోజకవర్గ నాయకుడెవరో స్పష్టం చేయడం వల్ల కార్యకర్తలు సమీకృతమౌతున్నారని, వారిని కూడగట్టుకొని ఎన్నికలకు సిద్ధం కావడానికి ఆయా అభ్యర్థులకు కావలసినంత సమయం ఇచ్చినట్లు అవుతున్నదని సర్వే నివేదిక వచ్చిందట. దానితో తమను తాము శెబాష్ అని వెన్ను తట్టుకొంటున్నారు జగన్ పార్టీ నేతలు.

అయితే ఈ 90 స్థానాలు పెద్దగా పేచీలు లేనివి కావడం గమనార్హం. పోటీ ఎక్కువగా వుండి, క్లిష్టమైన పరిస్థితులున్న నియోజకవర్గాలను ఈ మొదటి జాబితాలో చేర్చలేదు. మలి జాబితాలో

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com